# Ashtathikkula Aruda Sastram.





Published By

**K. Chellappa Mudaliar,**

Printed By

SRI RANGAVILASAM PRESS,

MADRAS.

 1933. [Price 1—8—0

GOD PARAMESHWARA
TAUGHT THE JYOTISHA
ABOVE TO PARVATI DEVI.

# స్థూల సూక్ష్మ పంచపక్షి
# అష్టదిక్కులయారూఢ
# శాస్త్రము.

(1, 2 భాగము చేరినది.)

చంద్రగిరి - చిన్నయ్యగారి

విరచితము.

Printed at the
SREE RANGA VILASA PRESS,
MADRAS.

శ్రీ ర స్తు.

స్థూల సూక్ష్మ

పంచ పక్షి

# అష్టదిక్కుల ఆరూఢము.

(1, 2 భాగములుచేరినది.)

ఇ ది,

అనేక గ్రంథములనుండియు, తాటాకు పుస్తకములనందుండిన దానిని

చంద్రగిరి - చిన్నయ్య

అ ను వా రి వ ల న

తెనుగున తర్జుమాచేయబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

శ్రీ చెన్నప్ప మొదలియారు గారిచే

శ్రీ వరదరాజులు మొదలియారి గారి

స్వ కీ య

శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడియె.



దీని ధర] 1930 [1-8-0

# Preface.

There is a delightful chapter in a delightful book called "THE STHOOLA SOOTCHMA PANGHAPATSHULA ASHTA THIKKULA ARUDA SHASTIRAM" in Telugu which tells how the mortals can understand about the Shastrama very easily. and How?

The above said Shastrama Taught by GodParameshwara to Parvathi Devi about Jyotisha.

In olden days there were different kinds of Yogis has written in different Languages such as Sanskrit, Dravida, Carnatic, and so on. If we search that Shastara the mortals couldn't find out the secrets of the Jyotisha Shastiram. That is only possible to find out by immortals and not by mortals some of them proclaimed "The Sthoola Sootchma Pancha Patshula Ashta Thikkula Aruda Shastram" to somebody havind good characters.

If we investigate the Secret of the Jyotisha Shastira fully well and well experienced, and then only we can find out the above said Shasrira very easily. This is the only way to find out "The Sthoola Sootchma Pancha Pachula Ashta Thikkula Aruda Shastiram and there is no other easy way to findout this.

PUBLISHED BY

K. CHELLAPPA MUDALIAR.

# చిన్న మనవి



ఇది భరతఖండవాసులగు సకలజన ప్రశ_స్తము దెలియఁజేయు నది యేమనగా, చెన్నపురి రాజధానితో సంబంధమగు కోళప్పంజేరి యను గ్రామవాసియగు రాజశ్రీ. ముత్యాలమొదలియారు కొమారుఁడగు కో. రాజశ్రీ. చెల్లప్పమొదలియారు ద్రావిడ వంశాభిమానము విడచి ఆంధ్రభాషాభిమానిమై పశ్చిమో_త్తర దేశంబుల వీరుపరంపరగా ఆంధ్ర గ్రంథములను ముద్రింపించి ఆయాప్రదేశముల విక్రయించుచున్న నీరి ఖ్యాతత వెల్లఁడయ్యెను నవీనగ్రంథములు వచనరచనములయందును పద్యగద్యలయందును ఆశ_క్తిగలవారై యుండుటవలన ప్రాచీన పురాణ జ్యోతిష ప్రసిద్ధ గ్రంథమగు స్థూలసూక్ష్మ పంచపక్షి, అష్టదిక్కుల ఆ రూఢ శాస్త్రమును మృదుభాషతుల్యముగ ఆబాలగోపాలపర్యంతము జనులు కనుగొనుటకుగాను విడివిడిగా వ్రాసి తేటతెల్లమిగా సులభ శైలిని ముద్రింపందొణంగె.

ఇది రాజశ్రీ. చంద్రగిరి. చిన్నయ్యగారిచే విడివిడిగా రచియిం పబడిన యీగ్రంథము మ-రా-రాశ్రీ, కోళప్పంజేరి చెల్లప్పమొదలి యారువారు సర్వస్వాతంత్ర్యముపొంది ముద్రించి ప్రచురింపఁబడియె. యీగ్రంథము యింగ్లీషు గవర్మెంటులో మాయొక్క ఉత్తరవు పొం దకుండా యితరులు అచ్చువేయరాదు.

హద్దుమీరి ముద్రించువారలు గవర్మెంటువారి ఆక్టుప్రకారము 1923 సం॥ 3-వ ఆక్టును అనుసరించి అపరాధములకును మాకుఁగలనష్ట ములకును బాధ్యతలగుదురని యెఱుఁగవలయు.

ఇట్లు,

కో. చెల్లప్ప మొదలియారు.

నెం. 19, ముద్దుకృష్ణుని వీధి,

మింటుబిల్డింగు పోష్టు, మదరాసు.

# పీఠిక

శ్రీమదనంత కల్యాణ పరిపూర్ణ విభవాలంకృత కరుణారస భరిత సృష్టి స్థితిలయకార్యకారణుండై సకలభువనంబుల పిపీలికాది బ్రహ్మ పర్యంతము వ్యాపకంబై రజస్సత్వతమోగుణంబుల వెలయు నపుడు మనుష్యజన్మంబు లతి శ్లాఘ్యనీయంబులై చెలగె అట్టిమనుజులు పూర్వజన్మ కర్మోపార్జితలచే గష్టబడుసమయమున వారి దురవస్థలు నివారించుకొనదగు కాలక్రమంబుల దెలిసికొనదగు మార్గం బొక్కటి గలదు అది యెద్దియనగా,

అమితగుణగరిష్ఠులై పవనపర్ణాంబుభక్షులై పెనుకాలము తపమున శ్రేష్టులై వెలయునట్టి మహామునులును అపరోక్షానుభవ వైఖరులు ఆహారనిద్రాదులుమాని యవధూతాశ్రమ విశారదులును ఆర్యజన పూర్వాచార్యులును యితరేతరపండితులగు ఋషులును లోకోపకారముగ పలుదెరంగులుగాగల సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాట భాషలయందుగల యభిప్రాయంబు లనేకములుగలవు.

అయ్యది శాస్త్రంబులు క్రోడీకరించి జూచునెడ. శాస్త్రంబులలో జ్యోతిషమను శాస్త్రమునగల రహస్యంబులు మనుజులకు అగోచరంబులై యున్నవి. అయ్యది బ్రహ్మజ్ఞానుల కలవియేగాని పామరుల కసాధ్యము తపశ్రేష్టులకు జ్యోతిషశాస్త్రమును బలుకుటకన్న భగవదారాధనలు శ్రేయంబని దలంతురు, అందులో కొందరు మనుజుల యెడ ప్రియము గలిగి కరుణతో పంచపక్షుల రహస్యంబును శాస్త్రమొందు వెల్లడి జేసిరి.

ఈ శాస్త్రమువలన పలుదెరగులగు జ్యోతిష శాస్త్రంబులు చదువ బనిలేదు, ఈ శాస్త్రమునగల రహస్యంబులు చక్కగా పరిశీలించి అభ్యాసమునకు దెచ్చినవారికి జ్యోతిష శాస్త్రంబు లన్నియు ఫలించినట్లగును. ఇంతకన్న సులభమార్గం బింకేదియు లేదనిస్థిరముగా దోపబడును.

సీ. అకలంకమూర్తి యూ నలుపచే నెలకొన్న
వేద శాస్త్రాగమ విధులుచాల

సకలశాస్త్రఫలంబు లనుసరించినమునులు
నంతసించగ ప్రజలు సమ్మతింప
ప్రకటించి యుచితంబు బలుకుటమే లేది
యనుచు యోచించిరి యవనియందు
ప్రబలగాహితమొసగు పక్షిశాస్త్రంబొకటి
బలుకనేర్చినమేలు బరగుచుండు.

అనుచుమానులు కగణించి రలవిగాను
నరులు గనుగొన తగినట్టి శాస్త్రమొకటి
సులభమార్గంబు లెరుగుట సూక్ష్మమగును
పంచపక్షుల చర్యల బలుకులిడిరి.

సీ. అవనిలో ద్రావిడ భాషాభిమానియై
ఆర్యప్రీతిగ పూజసలుపువాడు
పరులకింసలసేయ కలలోన నెరుగడు
తలితండ్రులను పూజ సలుపువాడు
కానసంబుల ఘోర తపములే సలిపేటి
తపసులగనిపూజ సలుపువాడు
శివకేశవుల దివళంబులేగనుగొన్న
సంతసింపుచుపూజ సలుపువాడు

దప్పులెన్నడు పరులకు ధాత్రియందు
గొప్ప బుధులుండు కోళప్పంజేరి
ముత్తయామొదలికి సూనుడనుచు
మీరు గుణధీరు చెల్లప్ప మొదలియారు

క. ఈతని ప్రేరేపణచే
ఆతతముగ పంచపక్షి శాస్త్రంబును స
త్ప్రీతిగ వ్రాయుమటన్న దె
ళీతిగనక చిన్నయామ ఖ్యుడిది లిఖియించె.






అష్టదిక్కులననుసరించిన చక్రము

# అష్టదిక్కుల ఆరూఢము

క. శ్రీకరుడగు వేంకట నా
యకుడగు మా దేవ దేవ నాథునిమదిలో
లోకాభిరాముడనుచును
నాకోర్కెలు దీర్చమంటి నవనీస్థలిలో౯.

సూర్యుని రాసుల చక్రము.

| | | | |
|---|---|---|---|
| మీనము ఈశాన్యం ఉత్తరమునకుతూర్పు | మేషము తూర్పు ఇంద్ర దిక్కు | వృషము తూర్పు ఇంద్ర దిక్కు | మిథునము దక్షిణమునకుతూర్పు అగ్నిమూల |
| కుంభము ఉత్తరము కుబేర దిక్కు | దిక్కుల నెరుగునట్టి రాశిచక్రము | | కటకము దక్షిణము యమ దిక్కు |
| మకరము ఉత్తరము కుబేర దిక్కు | | | సింహము దక్షిణము ఘేమ దిక్కు |
| ధనుసు ఉత్తరమునకుపడమర వాయువు మూల | తుల పడమర వరుణ దిక్కు | వృశ్చికము పడమర వరుణ దిక్కు | ధనుసు ఉత్తరమునకుపడమర వాయువు మూల |

సీ. రాసులుపండ్రెండు రంజిల్లునార్యుండు
రాశిరాశికి నెలలుమారుచుండు
పదునాల్గు భువనంబు ల్వ్యాపించు దినకరు
డాది దేవుండటంచునొప్పుచుండు
ఉడురాజునకువెల్గు ఉపరివీధికి వెల్గు
తరుచుగా నిచ్చేటి ధన్యుడితడు
అండంబునకుచుట్టు అణువుగా భావించు
దండికాపయి లోక ధాతయగును.

పంటపైరులకాధార ప్రభువునగుచు
జీవరాసుల కుసురిచ్చు చెల్మితోను
అర్ఘ్యముల కొప్పు ఆధిత్యునకును
మోదములుమించ వేవేలుమ్రొక్కులిడెద.

సీ. తూర్పు యింద్రునదిక్కు తోడగు మేషంబు
వృషభముల్ గూడి కైవరలుచుండు
దక్షిణంబెమదిక్కు దనరునుకటకంబు
సింహరాశియు తానై చెలగుచుండు
బశ్చిమంవరుణుండు బ్రబలుచు
తేలున ప్రాసురాశినిగూడి దనరుచుండు
ఉత్తరంబు కుబేరు డుండున మకరంబు
కుంభరాశినిగూడి గులుకుచుండు.

మీనరాశిని యీశాన్యుడింపుగాను
మిధునమునయగ్ని నైరుతికన్యయందు
ధనుసుననుయుండు మారుతిల్లగాను
అష్టదిక్కురాసుల నరయవలయు.

ఈ యెనిమిది దిక్కుల అరూఢప్రశ్నలను శాస్త్రిముల నెరిగి
దెలుపుట కెట్టులనగా తమతమ కార్యముల అనుకూల ప్రతికూలముల

దెలిసికొనుటకై ఆరూఢమడుగు వారలువచ్చి నిలచేదిక్కును గుఃఱుతించి పై చెప్పబడిన రాసులలో యిట్టి రాశియని దెలిసి అప్పుడు గడచునట్టి ఝామము వారము లరసి ఆవారములకు తగు ప్రోక్తముల సంఖ్యలను జూచి విమర్శగా చెప్పవలెను.

విఘ్నేశ్వర స్తోత్రము.

క. శ్రీవరసురనరులకు స
ద్భీవనమైనట్టికార్య సిద్ధులనెల్లన్
భావించి చక్కబరచెడు
దేవుండగు విఘ్ననాథ సేవునిదలతున్.

శంకరస్తోత్రము.

చ. అనిమిషరాజు బ్రహ్మయును యక్షులు భూతగణంబులాదిగా
వినతులు దేవమానులును వేడ్కగశైవులు దేవతావళుల్
ఘనతసుమంబులందికొని కాంచనపల్లెరమందు హారతుల్
గొనిశివనాధునింగనిన గోర్కెలనిచ్చెడివానిగొల్చెదన్.

సహదేవ స్తవము.

క. విహరించిపాండవులతో
సహజుండయిమెలగి శాస్త్రిసంపన్నుండౌ
సహదేవుబలుకు వాక్యము
నిహమందున వ్రాయబూని తిప్పడెగనుడీ.

1 ఆదివారము తొలిఝామున తూర్పుదిక్కునయుండి ప్రశ్నలడుగువారికి ప్రత్యుత్తరమొసగు విధము.

తలచివచ్చిన వివాహకార్యము అనుకూలమగును. తమనివాసమునకు పడమరగా కుదుటపాటగును. మరియొకప్రశ్న తామునియమించుకొనిన నౌకరి అనుకూలమునకువచ్చి యానౌకరియందే నిల

కడగా యుండి కాలము గడపవచ్చుననియు తమబంధువర్గములలో గలసిన యాతడు నల్లని మనుజుడొకడుండివాని సహాయమున వచ్చి యిల్లుచేరగలడనియు యీమూఢప్రశ్నలు దెలుపనగును.

2 ఆదివారము తొలిజామము. దక్షిణమునకు తూర్పునయుండి ప్రశ్న లడిగినవారలకు ప్రత్యుత్తరము.

గుండెలదర బుద్ధిచెడి మనోచింతలవహించి పదరుచు వొకజీవ మును దలచి యడుగుచున్నావు. ఆజీవుడు కన్యపడుచై యున్నది. దాని చేత చిక్కబడినసొమ్ము మరల నీచేతికివచ్చు టరుదు.

3 ఆదివారము తొలిఝాముమ దక్షిణ దిక్కునయుండి ప్రశ్న లడుగువారలకు ప్రత్యుత్తరము.

తననివాసమగు ప్రదేశమునందలి దూర దేశమునకు వెళ్లినయా తడు యెన్నడు రాగలడని యడిగినచో యాతడొక యింతినిగూడి సుఖానుభవుడై సజీవుడై యున్నవాడు. యింకొక నెల దినములు గడచిన తరువాత రాగలడని దెలియవలయును.

4 ఆదివారము తొలిఝాముమ దక్షిణమునకు పడమర దిక్కున యుండి ప్రశ్నలడుగువారలకు ప్రత్యుత్తరము.

ప్రస్తుతము తాను జీవించునట్టి జీవనము స్థిరమా యస్థిరమా యని సంశయంబునుపూని అడుగవచ్చితివి యా జీవనము భగవంతుని కటాక్షమున నిలకడమైయుండి యుజ్జీవించగలవు యిందు కేదియు లోటుచేదు సం దిహమువిడచి ధైర్యముగా నుండవచ్చును.

5 ఆదివారము తొలిఝాముమ పడమట దిక్కునయుండి ప్ర శ్నలడుగువారికి ప్రత్యుత్తరము.

శరీరమందు గలిగిన దుర్బలవ్యాధి దీరనందుచే ఆనైగ్ర వేమని అడుగవచ్చితివి. అది శరీరమునబుట్టిన రోగముగాదు. గ్రహదోషంబున

పీడింపబడియున్నది. యీ జాడ్యలక్షణము యిక మూడు నెలలలో దీరి పోవుచున్నది. అంతవరకు అనుభవించేగావలయు ఔషధము లియ్యక యే గ్రహదోష నివ_ర్తిజేయుట చాలామంచిదిః

### వాయుమూలనుండి ప్రశ్నలడుగువారికి ప్రత్యు_త్తరము.

తా మడిగినప్రశ్నవలన తమ ఆర్జితమగు ధనము. కానకపోయి నది నిజము. ఆద్రవ్యము అపహరించినవారెవరని అనుమానించి అడగ వచ్చితివి, యాధనము నీకు ప్రియముగానుండు స్నేహితునిచేత చిక్కు బడినది. ఆద్రవ్యము అడిగినయెడల కలహము సకభవించును. మనిస్సం కటము బధికమగునుగాని పోయినధనమురాదు.

### ఆదివారము తొలిఝామము ఉ_త్తరదిక్కునుండి ప్రశ్న లడుగువారికి ప్రత్యు_త్తరము.

మీారనుకొన్నప్రశ్నవలన వూరికి వు_త్తరదిక్కున అ_త్తగారింట కాపురముగాయుండే కొమా_ర్తె తమదేశమునకు యెన్నడు రాగలదో యనుసంశయమును దీర్చుకొనవచ్చితిరి. యిచ్చటికి వచ్చేతలంపు పూ _ర్తిగాయున్నది కావున యింకొక నెలదినములు గడపియందు రాగలదు. సంశయము వలదు.

### ఆదివారము తొలిఝామము ఈ శాన్యమూలనుండి ప్రశ్నలడుగువారికి ప్రత్యు_త్తరము.

మీాకతిపిృయంబున స్వతంతృబంధువులగువారుభార్యయు భ_ర్త యుగలసి తమపృదేశమును విడిచి పశ్చిమదిక్కునకు వేళ్లియున్నవారలు వారలు యేలాటి సుఖస్థితుల వెలసిల్లుచున్నారో యని దలచి పృశ్న యిచ్చితిరి వారలొకగామృముజేరి మనసున చంచలముగలవారలై కష్టముల అనుభవించుచున్నారు.

### ఆదివారము రెండవఝామము తూర్పుదిక్కుననుండి ప్రశ్నలడుగువారికి ప్రత్యు_త్తరము.

తమ స్వతంత్రుడు తమయింట కలహము జేసి తానున్న ప్రదేశ మును విడచి నై_రుతీమూలయందు తమబంధువులు యున్న యింటజేరి

యున్నవాడు వానిమనోచింతయు దీరదాయె. యిందే వచ్చుటకు మన సుండుటంబట్టి ఆతడు యెనిమిదిదినములలో రాగలడు.

ఆదివారము రెండవఝామము ఆగ్నేయమూలనుండి
ప్రశ్నలడుగువారికి ప్రత్యుత్తరము

నీవు వొక బ్రాహ్మణునిగోరి యాతనిచేతిద్రవ్యమును అప్పుగా నియ్యగోరితివి. ఆతడు దినక్రమమున రేపుమాపని కాలహరణము సేయుచున్నాడు. యింక వొక్కనెలపైకి ఆతడే నీవు కోరిన ధనమును యియ్యగలవాడు.

ఆదివారము రెండవఝామము దక్షిణదిశనుయుండి
ప్రశ్నలడుగువారికి ప్రత్యుత్తరము.

నీ చేతి ద్రవ్యమును అప్పుగా పరులచేతి కిచ్చితివి వారలు చేయునట్టి అగడమువల్ల యాద్రవ్యమువచ్చునో రాదోయని యడుగ వచ్చితివి. మంచిమాటలచేత సహజముగా యిచ్చువారుగారు న్యాయాధిపతిచెంత వ్యాజ్యముపెట్టినయంత యా ధనమువచ్చిచేరును.

ఆదివారము రెండవఝామము నైరుతీమూలనుండి
అడిగినవారలకు ప్రత్యుత్తరము.

భూమిపై పుట్టిననాటిమొదలు యీ దినమువరకు పడుచున్న కష్టములు యిట్టివని చెప్పశక్యముగాదు. అట్టి కష్టము యెన్నడు దీరునోయని దలచి అడుగుచున్నావు. పంద్రెండునెలలు గడచిన యంత ఆ బిడకుగల కష్టములన్నియు తొలగిపోవును సుఖారోగ్యముల పొందును.

ఆదివారము రెండవఝామము పడమరదిక్కునుండి
అడిగినవారలకు ప్రత్యుత్తరము.

తమగ్రామస్వగృహంబున గలిగిన కఠిన కలహము యెన్నడు దీరునని సంశయించి అడుగుచున్నావు. యా కలహము వొక యింతి వలన గలిగినది ఆ యింతిమాటలు పనికిరావు త్వరితకాలమున యాకలహము నివర్తించును. యెప్పటియట్ల సఖ్యముతో యుందురు.

14 ఆదివారము రెండవఝామము వాయువ్యమూలనుండి అడిగినచో ప్రత్యుత్తరము.

ఇంతకాలపర్యంతము జీవించుచున్న నౌకరియందు గలిగిన పొరబాటువలన యా నౌకరి నిలకడగాయుండగోరి తమచేతయున్న ద్రవ్యమంతయు వ్యాజ్యమున ఖర్చిడి చాలానష్టముల పొందితివి. మరల ఆనౌకరియే యికమూడునెలలపైకి నిన్నే కోరివచ్చును. యిది నమ్మకము.

15 ఆదివారము రెండవఝామము ఉత్తరదిక్కునయుండి ప్రశ్నయిచ్చిన ప్రత్యుత్తరము.

తమకులసంబంధమగు వొకయువతీరత్నము దూరదేశమువెళ్లి యుండి ఆచోట తాను ఆతిరోఘముచేత మరణమొందిన విధము, లిఖితమూలముగా దెలియవచ్చును మరియొకవిశేషము దక్షిణమూల నుండి యోగఫలముగల వృత్తాంత మొకటివచ్చును. యిది ద్వయా రూఢఫలము.

16 ఆదివారము రెండోఝామము ఈశాన్యమూలయందుండి అడిగినవారలకు ప్రతి.

తామడిగిన సందేహాశ్పదప్రశ్నవలన దెలుపునది యేలాగనగా తామతిచింతతో బుద్ధిస్థిరములేకయున్నది. కారణము. అతిరోగపీడితుడైయున్నవాడు సజీవుడై బ్రతుకునా బ్రతుకడాయని దలంచెదవు. వానికిగల రోగము గ్రహపీడితమైనది. వానిజీవము గోడమీాది పిల్లి చందమున యున్నది. దైవకటాక్షమున బ్రతుకుచున్నాడు వాని జన్మము మరుజన్మమని యెరుగవలెను.

17 ఆదివారము మూడవఝామము తూర్పుదిక్కునయుండి అడిగినచో

తాామున్న గృహమునందు పలువిధములగు కష్టములు సంభవించి పైపైకివచ్చుచున్న దుఃఖములున్ను మనోపీడితములును గలిగియున్న చింతలు యెన్నడు నివర్తించి సుఖము గలుగజేయునని ఆలోచించి అడుగవచ్చితిరి తమగ్రహదోషమువల్ల ఆరునెలలు దాటినదే

2

పలువిధములగు కష్టభరములును మనోచింతలును నివర్తించును ఆపై దినక్రమమున సుఖములే గలుగును.

18 ఆదివారము మూడవఝామము ఆగ్నేయమూలనుండి యడిగిన

నీవు ప్రారంభించబోవు వ్యాపారమును వొకనితోడు జేసుకొని భాగముగా చేయ నెంచియున్నావు. అతడు యెఱ్ఱని ఛాయగల శరీరముగలవాడు అతని బుద్ధి స్థిరముగాకున్నందుచే యిక నెలదినములు గడపితి రేని ఆతడేవచ్చి గలసి వ్యాపారముచేయగలరు.

19 ఆదివారము 3-వ ఝామము దక్షిణదిక్కునయుండి యడిగిన

నీ సహోదరునకు నీకు గలిగిన కలహముచేత మనోచింతలు గలిగి యీ చోటువిడచి పోయియున్నాడు. అట్టి తమ్మునిమనసు తల్లడిలుచున్నది. ఆతడు నైరుతీమూలనుండి వచ్చుచున్నాడు. నేడు రేపు యీరెండు దినములలో యిల్లుచేరగలడు.

20 ఆదివారము 3-వఝామము నైరుతీమూలనుండి అడిగిన

రోగపీడితురాలై అవస్థలబడుచున్న పశుచుకై ప్రశ్నయిచ్చితివి; ఆ బిడశరీరమునగల జాడ్యము దీరుట సంశయము. నీవు నమ్మవద్దు.

21 ఆదివారము మూడవఝామము పశ్చిమదిక్కునయుండి అడిగినచో

నీవు చూచివచ్చిన పంటభూమిని క్రయమునకు గొన్న యెడల ఆ పొలము ఫలించి సుఖము గలుగజేయునా యని యడిగెదవు. ఆ భూమిని గొనుట వల్ల సుఖమున్ను ఫలమున్ను గలిగి యభివృద్ధి నొందుదువు.

22 ఆదివారము మూడవఝామము వాయుమూల నడిగినచో

నీచేతియుంగరము కానక పోయినందుచే అదియెవరి వశమున యున్నదని ప్రశ్నయిచ్చితివి. యీ వుంగరము పరులచేత నగబడలేదు యిల్లువిడిచిపోలేదు నీ భార్యముఖాంతరమున నీ చేతికి వచ్చిచేరును.

23 ఆదివారము మూడవఝామము ఉత్తరదిక్కునయుండి అడిగినచో

నాలుగుకాళ్ల జీవుడు కానకబోయినందుచే ఆ జీవుడు వచ్చిచేరునా చేరదాయని అడుగవచ్చితివి. ఆజీవుడు నీకత్యంత ప్రియముగలవానిచేత కట్టబడి యున్నది. మూడు దినములలో వచ్చిచేరును. సందేహించవద్దు.

24 ఆదివారము మూడవఝామము ఈశాన్య దిక్కునయుండి అడిగిన

యిపుడు నీవు అడగవచ్చిన ప్రశ్నలక్షణము. వివరించెద ప్రస్తుతము చేతడబ్బు లేకుండుటచేయికమీద యేలాగు బ్రతుకుగలమోయని ఆలోచించుచున్నావు. నీకు గల కష్టకాలము మూడునెలలే యుండును. ఆపై దినక్రమమున సుఖమును పొందుదువు.

25 ఆదివారము నాలుగవ ఝామము తూర్పుదిక్కునయుండి అడిగిన

నీతోడ బుట్టువైనచెల్లెలకు వివాహము నిశ్చయించుకొన్నట్లు అగునాకాదాయని అడుగుచున్నావు. ఆ వివాహము జరుగుటకు సందేహములేదు. మరియొక విశేషము యేమనగా నీచెల్లెలైనను నీ స్వబంధువులలో చెల్లెలుగానైనా యుండవచ్చును. శీఘ్రముగనే వివాహము కుదురుచున్నది.

26 ఆదివారము నాలవఝామము ఆగ్నేయదిక్కునయుండి అడిగిన

వివాహమైన నాటిమొదలు యిదివరకు పేకటిగా లేదని దలచి ఆ సంశయము నివర్తించుకొనవచ్చి అడుగుచున్నావు. ఆ బిడకు జడలుమునిదోషముదగిలి రోగపీడితురాలై యున్నది. ఆజాడ్యముశీఘ్రకాలమునం తొలగిపోవును. అంతకుపై గర్భముదాల్చి సుఖముగానుండును.

27 ఆదివారము నాలుగవ ఝామము దక్షిణదిక్కునయుండి ఆరూఢమడిగిన

మీ పిల్లవాని బడికి పంపి విద్యలగఱపించుటచే వృద్ధికి రాగలడా లేడాయని అడుగుచున్నావు. వానికి విద్యాభివృద్ధిలేదు చేతిపని

గ్రహించగలడు ఆపని యేలాటిదని దెలుపగోరెదవు. శిల్పిపనులయందు చాలా బుద్ధిగలవాడై దినక్రమమున వృద్ధిపొంది ధనికు డగును.

28 ఆదివారము నాలుగోఝామము నైరుతీమూలనుండి అడిగిన

నీటిపై యాత్రగావెళ్లి అచ్చోటు విడిచి యెన్నడు రాగలడో యని ఆలోచించి వుత్తర మొకటి వ్రాశియున్నావు ఆ వుత్తరమునకు ప్రత్యుత్తరము అతి శీఘ్రముగా వచ్చును.

29 ఆదివారము నాలవ ఝామము పశ్చిమదిక్కునయుండి అడిగిన

దేశాంతరముగా వెళ్లిన నీయన్న యిదివరలో చాలాదినము లాయెను. యింకయు రాకయున్నాడే అతడు జీవముతో యున్నాడా లేడా అను అనుమానము పూర్తిగాయున్నది అట్టి సందేహము వద్దు అతడు సజీవితుడై యున్నాడు తొమ్మిదినెలలు యాత్రగడపి వచ్చుచున్నాడు భయమందవలదు.

30 ఆదివారము నాలవ జామము వాయువు మూలనుండి యడిగిన

నీవు వుజ్జీవించుటకై వొకజీవుని నమ్మి ఆతని మూలకముగా నౌఖరి కుదురునా కుదరదాయని అడుగనేర్చితివి. ఆతడు దినములు గడపగలడుగాని ఆతనివల్ల గానేరదు అతని ప్రేరేపణ యేదియు సాగదు.

31 ఆదివారము నాలుగవ జామము ఉత్తరదిక్కునయుండి అడిగిన

నీతల్లితోకూడపుట్టిన వంశమునగల వొకకన్యపడుచు గతించినదని తూర్పుదిక్కునయుండి వొకడువచ్చి తమకు దెలియజేయగలడు.

32 ఆదివారము నాలవజామము ఈశాన్య మూలయందుండి అడిగిన

నీ దాయాదులకును నీకును గలిగిన విరోధమువల్ల వ్యాజ్యములుగలిగి న్యాయాధిపతియందు వ్యవహారము దీరి చేతిసొమ్ము

నష్ట మయినను నీ పక్షమగుటకు వొక్క సంవత్సరము అగ వలెను.

ఆదివారముయొక్క ఆరూఢ
ఫలా ఫలములు ముగిసెను.



1 సోమవారము తొలిజామము తూర్పుదిక్కునయుండి
అడిగిన

నీవు వొకకార్యమును ప్రారంభించుటకై వొరుని చెంతజేరి కొంత ద్రవ్యమడిగియున్నావు వానిచేతిధనము వచ్చునా రాదాయని సంశయించి అడుగవచ్చితివి నీ కార్యము అనుకూల మగునంతటి ధనము యీగలడు. భయమొందవలదు. ఆలస్యమున యగును.

2 సోమవారము తొలిజామము ఆగ్నేయమూలనుండి
యడిగిన

నీతోడ బుట్టువులగు నలుగురు గలసి కలహము గావించుకొని కుటుంబమునువదలి వొక్కొక్కరు వేరువేరుగా కాపురముండచనిరి వారలు ఆలాగు చనినందుచే నీ మనసునకు ఆయాసము గలిగి చాలా కష్టపడుచున్నావు మరల నొక్కటిగా గలియుట దుర్లభము.

3 సోమవారము తొలిజామము దక్షిణ దిక్కునుండి
యడిగిన

నీవు వొకజీవునికై ప్రశ్నయిచ్చితివి ఆతడు వోడయాత్రజేసి యొకవూరుజేరి అచ్చట నొక స్త్రీని గలసి సుఖమున యున్నాడు. ఆతడు యీ ప్రదేశమువచ్చునట్టి ఆలోచనలేదు అతనిరాక మరచి పోవలసినదే.

4 సోమవారము తొలిజామము నైరుతి దిక్కునయుండి
అడిగిన

నడివయసుగల వొక గోవు చోరము పోయినందుచే యీ విచారమున వచ్చునా రాదాయని అడుగుచున్నావు. ఆ గోవును వొక

డు వాయువ్యమూలగా గొనిపోయియున్నాడు అచ్చోట జనిన యంత గోవ్వుండుచోటు దెలియును. వెంటనే నీవు దెచ్చుకొనుటకు వీలు బడును.

5 సోమవారము తొలిజామము పశ్చిమదిక్కునయుండి అడిగిన

నీవు యచ్చోట వెళ్లినను ఆయాస్థలమ్ముల కలహములే వాటిల్లు చుండును. నీవు యున్నట్టి యుద్యోగము చెడిపోయినది. ఆదరణలేక నిలచియున్నావు శనైశ్వరుని పార్వచేత యీలాగాయెను. గోచార ఫలము విరోధమైయున్నది.

6 సోమవారము తొలిఝామము వాయువ్యమూలనుండి యడిగిన

నీవు కోరినట్టి కార్యములు కైవల్యమగుటయేగాక మీయింట గలస్త్రీ యొకతె మొగపిల్లవానిని ప్రసవించును. ఆ ప్రసవము సుఖ ప్రసవము మరియు దేశాటనముగా వెళ్ళిన యాతడు కొద్దిదినములలో వచ్చిచేరగలడు మేలగును.

7 సోమవారము తొలిఝామము ఉత్తరదిక్కునుండి అడిగిన

నీ స్వబంధువైనను నీ మిత్రుడైనను వొకడు పాముచే గరవబ డిగతించినాడని లిఖితమువచ్చును. ఆ లిఖితమునుజూచి చాలాదుఃఖిం తువు. కలిన ఆరూఢఫలము.

8 సోమవారము తొలిఝామము ఈశాన్యమూలనుండి యడిగిన

నీవు సంతోషించునట్టి ద్రవ్యము పరులచేత రాగలదు. ఆద్ర వ్యముచే శుభములున్ను గలిగి దినక్రమము వాణిజ్యముననను అభివృద్ధి నొందుదువు. సందేహించవలదు.

9 సోమవారము రెండవఝామము తూర్పుదిక్కునయుండి
అడిగిన

నీసాభిప్రాయము సంపూర్ణమగునట్లు ద్రవ్యమువచ్చి జేరుటయే గాక ఆభరణములు మంచి వస్త్రములు యివియెల్ల చేకూరును. పశ్చిమదిశనుండి స్వబంధువర్గములున్ను ప్రియులున్ను సుఖజీవితులై యున్నారని శుభవార్తలు వినగలవు.

10 సోమవారము రెండవఝామము ఆగ్నేయమూలనుండి
యడిగిన

నీ గోచారప్రకారము ఇప్పుడు శనిపాదమున దిగియున్నాడు గావున దలచిన కార్యములు వశమగుట మధ్యమమగును. అయినను కానకపోయిన బంగారు ఆభరణము యెప్పటియట్ల వచ్చిచేరును. కొద్ది దినములలో నీ కష్టము నివర్తియగును.

11 సోమవారము రెండవఝామముదక్షిణమూలనుండి
అడిగిన

నీ ప్రశ్నవలన శుభఫలముకుయగుచున్నవి. నీకు అత్యంత విరోధిగాయున్నవాడు తనకు తానై విరోధమును వదలి అతిప్రియముగల స్నేహితుడగును. నీవు యితర దేశమునకు పోవుటకై నిశ్చయించుకొన్న ప్రయాణము నిలచిపోవును. శుభవార్తలు నీవు వినగలవు.

12 సోమవారము రెండవఝామము నైరుతీమూలనుండి
యడిగిన

నీ వడిగిన ప్రశ్నఫలము దుఃఖకరము అగ్నిభయము చోరభయము యివిరెండున్ను తప్పించుకొనుట దుర్లభము తనచేతిపనులు సఫలమగుట మధ్యఫలమగును. చేతనున్న ధనమున్ను ధాన్యములున్ను ఖర్చగుటచే నష్టమున్ను గలుగును.

13 సోమవారము రెండవఝామము పశ్చిమదిక్కునయుండి
యడిగిన

నీ వతి శ్లాఘనీయంబైన సన్యాసాశ్రమంబు గైకొనదలంచివచ్చి అడుగనేర్చితివి ఆయాశ్రమము నీకు చేకూరుటకు షణ్మాసము నెలలు

గడపవలెను. ఆలాగు గడపి చనినచో జలపూరితంబులగు నదులు దాట టరుదుగాన కొద్దిదినములు యింటియందే కాలము గడుపుము.

14 సోమవారము రెండవఝాముమువాయువ్యమూలయందుండి అడిగిన

నీ వడిగిన యారూఢఫలము మంచిదై యున్నదిగాన మంచివానలు గురిసి ధాన్యములు మొదలగు పంటలు చక్కగా ఫలించును. తనయింట నొక శిశువుకు గలిగిన రోగములు నిన్ను బాధించుచున్నది. శీఘ్రముగా శిశువురోగములు దీరి సుఖముగా యుండును. నీవు కోరిన కోర్కెలెల్ల సఫలములై నెరవేరుచుండును. చాలాసుఖము

15 సోమవారము రెండవఝాముము ఉత్తరదిక్కునయుండి యడిగిన

ఒకడు నీతో కలహించి ప్రత్యక్షవైరిగా నిలచియున్నాడు వాని జూచిన యంత మిక్కుటమగు కోపముతో యున్నావు. నీ కోపము వానిముందుచెల్లదు. వానిచేత నానావిధములగు అడ్డపాటులున్న కష్టములును గలుగుచున్నవి యివి జాలక కులకాంతయగు నీభార్యకు నీకును వైరములు గలుగుచున్నవి. కొన్నిదినములు గడచిన తరువాత కలహములు దీరును.

16 సోమవారము రెండవఝాముము నైరుతీమూలనుండి యడిగిన

నీవు యిచ్చటి జీవనము విడచి యితరదేశమునకు వెళ్లి అందు జీవించవచ్చునని తలంపుతో అడుగవచ్చితివి. నీ ప్రయాణముచే నీకు చాలా సుఖము గలిగించును. అందొక నరుని సహాయమును పొంది వానిమూలముగా సుఖముగా జీవింతువు.

17 సోమవారము మూడవఝాముము తూర్పు దిక్కునయుండి యడిగిన

తగనిమాటలచే నీ మీద నేరము మోపి నిన్ను తంటలబెట్టి అందరు గూడి నిన్ను కలహించి తొలగసేయుచున్నారు. అట్టి చిక్కు యెన్నడు విడునా యని తలచి అడుగుచున్నావు యీ కష్టము తొల

గుటకు మూడు సంవత్సరములు ఆగవలెను. ఆపై నీకుసుఖము గలుగును.

18 సోమవారము ౬-వ ఝామము ఆగ్నేయమూలనందుండి యడిగిన

నీవిపుడు ప్రారంభించినవ్యాపారము చాలానెమ్మదిగాను లాభముతోను నలుగురిలో నాణ్యముగాను వర్ధిల్లుచుండును. యావాణిజ్యమువల్ల కలిగిన వ్యాజ్యము నీపక్షమున వోనగూడును. నీవుదలచిన కార్యములన్నియు నీచేతిలోని వగుటవైె బ్రకాశింతువు.

19 సోమవారము ౩-వ ఝామము దక్షిణదిక్కునయుండి యడిగిన

ప్రస్తుతము జీవించుటకు మార్గమేదియుగాననందుచే వొకని సహాయమువల్ల నౌకరి కుదురునా కుదరదాయని గోరి అడగవచ్చితివి ఆ జీవుని నమ్ముటవల్ల ప్రయోజనములేదు. వానివల్లకానేరదు, నీకష్టకాలము తొలగుటకు యికను మూడువారములు గడపవలెను. ఆమీాదట దినక్రమమున సుఖమేగలుగును.

20 సోమవారము ౩-వఝామము నైరుతీమూలనుండి యడిగిన

ఒక స్త్రీవలన చాలానష్టమున్ను మనస్సంకటములున్ను గలిగి దుఃఖమున మునిగియున్నావు. యిపుడు న్యాయస్తానమునకు యీవ్యాజ్యము వెళ్ళియున్నది. ఆ వ్యాజ్యము యేలాగానో యని ఆలోచించి అడిగెదవు అదినీవైపున జయముగలిగి ఖర్చయినద్రవ్యము నీకు రాగలదు.

21 సోమవారము ౩-వఝామము పశ్చిమదిక్కునయుండి యడిగిన

యిపుడుండే నౌకరివల్ల ప్రయోజనములేదు మరియొకచోట చని అచ్చటి నౌకరిలోయుండి కాలము గడుపవచ్చునని దలచియున్నావు. ఆనౌకరి కుదురుపాటగునా కాదాయని యడిగెదవు. యిపుడుండే వుద్యోగము దినక్రమమున వృద్ధియగును. మరియొకచోట కుదురుపాటు గానేరదు. యిది నమ్మకముగా దలచుకొనుము.

22 సోమవారము 3-వఝాముమము వాయువ్యమూల నుండి యడిగిన

నాలుగుకాళ్లుగల వొక జీవమును క్రయమునకు గొనుటకై పశ్చిమదిక్కునకు వెళ్లుటకై ప్రయాణము సిద్ధపరచుకొన్నావు. ఆజీవుడు నీచేతికగుబడును. దానిచేసుఖముగలదు. కుటుంబమునభివృద్ధియగును శుభఫలము.

23 సోమవారము 3-వఝాముమము ఉత్తరదిక్కునయుండి యడిగిన

ఒక వివాహమునకై గోరి అడుగవచ్చితివి ఆ వివాహముకుదురు పాటగును. అందుకు తగువారలుగూడి మాటలనిశ్చయించి నీ కను కూలము గావింతురు. దీర్ఘకాలము జీవించునట్టి సొమ్ము వొకరిచే నీకు స్వాధీనమగును. శీఘ్రముగా వివాహము జరిగి వధువునీచేత మాంగల్యము ధరియించుకొనును. శుభఫలము.

24 సోమవారము 3-వఝాముమము ఈశాన్యమూలనుండి యడిగిన

నీవు యడిగిన యారూఢమువలన మంగళకరములే అగుబడుచున్నవి. అవి నీయింట నొక యువతీరత్నము పూర్ణగర్భముతోయున్నది. ఆబిడ సుఖప్రసవముగా పుత్రునిగనును, ప్రస్తుతము నీవున్న నౌఖరిలో ప్రసిద్ధిపొంది ధనలాభమును పొందుదువు నీ బంధువులు నిన్ను పొగడుచుందురు.

25 సోమవారము నాల్గవఝాముమము తూర్పుదిక్కునయుండియడిగిన

ఈ యారూఢము శుభఫలమును యిచ్చుచున్నది యేలాగంటే ఈ వత్సరమున వానలు కాలమునకు సరిగట్టి గురియును. వాటిచే పంటలు వృద్ధియై ధాన్యములు మిక్కటముగా ఫలించి లాభకరములేయగును. నీవు తలచినయట్లే అన్నికార్యములు కైవల్యమగును. నీకుటుంబమున గలవారలలో వొకనివల్ల క్షేమకరమై ప్రసిద్ధి పొందుదువు.

26 సోమవారము నాల్గవఝామముఆగ్నేయమూలనుండి
యడిగిన

నీవు దలచివచ్చినట్టి నీయింటగల కులదేవత మిమ్ములయెడ
కాసి యున్నది. ఆ దేవతను ఆరాధించుచువచ్చిన విధమును విడచి
పెట్టితిరి. సంపూర్ణముగా గావించుటకు ముందుగా కాళికాదేవళము
నకువెళ్ళి ప్రదక్షిణ నమస్కారములు గావించిన కులదేవికి తృప్తిగలు
గును. మరియు నీతండ్రి రోగపీడితుడై చాలాయిబ్బంది బడివచ్చు
చున్నాడు. అతడున్న కాళిదేవళము ప్రదక్షిణలుజేసిన జాడ్యము
మానిపోవును. సుఖమును పొందగలడు.

27 సోమవారము నాలవఝామము దక్షిణదిక్కునయుండి
యడిగిన

నీకుగల సొమ్మును తాకట్టుగా వొకనికి వొప్పజెప్పియు ఆ
సొమ్మునకై తానిచ్చిన రొక్కమునకు చాలదని నాయాధిపతివద్ద
వ్యాజ్యమునుకుదిర్చియున్నాడు ఆవ్యాజ్యమువలను ధనవ్రయమున్ను
మనస్తాపములును గలిగెను. కాబట్టివానిస్నేహమువల్ల విరోదముఅధిక
మగునుగాని తగ్గదు.

28 సోమవారము నాలవఝామము నైరుతిమూలయందుండి
యడిగిన

విషకాటువలన రోగపీడితుడై యున్నాడది దీననా దీరదాయని
యడిగెదవు. యిప్పుడాతనికి అంగారక దోషమువలన ఈ కష్టము గలి
గెను. నీకులదేవతకు పూజవేయించి ప్రార్థనచెల్లించుకొనును సుఖ
ము గలుగును.

సోమవారము నాలవఝామము పశ్చిమదిక్కునయుండి
యడిగిన

స్వభార్యవల్లగలిగి యుండేచింతవొకటి తనయులవల్ల గలిగిన
చింత యొకటి సహోదరులవల్ల గలిగిన దుఃఖమొకటి ఈలాటికష్టము
లచే చిక్కుబడిఅలయుచున్నావు. ఈ కష్టములువిడచి పోవుటకు
ముప్పది దినములుగడపవలెను.

30 సోమవారము నాలుగవఝామము వాయువ్యమూలనుండి యడిగిన

నీవు అధికగుణస్థుడై తపించుచు న్యాయస్థానమున దగులుబడితివి. ఆ యప్పుచే పరులకు విరోధివై దిరుగుచున్నావు ఈలాటిచిక్కులో నుండి నిన్ను విడదీయుటకు వొక స్నేహితుడుగలడు వాడైవచ్చి నిన్ను పలుకరించి నీ రుణముదీర్చి సుఖమున యుండజేయగలడు.

31 సోమవారము నాల్గవఝామము ఉత్తరదిక్కునయుండి యడిగిన

నీతోడబుట్టువగు సహోదరితో కలహము గావించుకొని నానా విధములగు బీభత్సలనుపొంది పరదేశిలాగున దిరుగుచున్నావు దిక్కు దిశయులేనివాడైతివి. ఆ చింతచే శరీరమునకు రోగముదగిలి తపించు చున్నావు. నిన్నాదరించువారు యెవరులేరు రెండుపక్షములు పోనించి వచ్చి ఆరూఢమడిగినచో అందుకు తగు పరిహారము చెప్పెదను.

32 సోమవారము నాలుగోఝామము ఈశాన్యమూలయందడిగిన

నీవు నిలకడగాయుందామని దలచియున్న నౌకరి నిన్ను విడనాడిపోయినది. మరల యా యుద్యోగము నీకు రాజాలదు. వొక జీవునివలన నేరొకచోటున నౌకరి కుదురుపాటగును. వొక్కవారదినములు గడపినతరువాత మేలగును.

సోమవార మారూఢము

ముగిసెను.



1 మంగళవారము తొలిఝామము తూర్పుదిక్కునయుండి యడిగిన

ఈ ఆరూఢఫలము సుఖములేదు యిప్పుడు శనిగ్రహముచే పీడింపబడితివి ఆ శనిపాదమున దిగియున్నాడు యిప్పా పాదశని యెప్పుడు

దీరునో యని చాలాదుఃఖాక్రాంతుడై అలసటలొందుచున్నావు. ఈ అంగారకుడు యిపుడుండుచోటువిడచి పోవుటకు నలువదియైదు దినములు వెళ్లవలెను. ఆపై శరీరారోగ్యము గలిగి సుఖమును పొందుదువు.

2 మంగళవారము మొదటిఝామము ఆగ్నేయమూలనుండి యడిగిన

గర్భవతిగాయుండు వొక యువతీరత్నము పురిటింటను ప్రవేశించియున్నది అప్రసవము కొంత కష్టమైనను చెరువువాటిల్లదు ఆబిడ ప్రసవించునట్టి శిశువు ఆడపోలేక మొగదోయని యడగనేర్చితివి. ఆబిడ పురిటింట బుల్లివానిగని శిశువున్ను తానున్ను సుఖము పొందుదురు. మంచిఫలము.

3 మంగళవారము తొలిఝాము దక్షిణదిక్కునయుండి యడిగిన

నీకుటుంబమున కలహము పైపై జనించినందుచే నీభార్య నీతో కలహముగావించుకొని అతికోపమున నిన్ను యెడబాసియున్నది. యిట్టి కష్టములెన్నడు దీరునోయని దలచివచ్చితివి. నీకుగల గ్రహదోషమువల్ల ఈ లాటికష్టములుగలిగెను. కొన్నిదినములు ఈలాగేయుండి యెప్పటియట్ల భార్యయు నీవున్నుగలశి కాపురముచేయుచుందురు. అప్పుడు కలహములు నివర్తియగును. సుఖముగలదు.

మంగళవారము తొలిఝామము నైరుతీమూలనుండి యడిగిన

ఈ సంవత్సరము వానలుకాలముతో గురిసి నీవు బెట్టినట్టి పంటలు చాలావృద్ధిపొంది దాన్యములు యెక్కువగా వచ్చుటయేగాక నీయింట వివాహమనెడి శుభకార్యమొకటి జరుగును. ఆ సమయమున నీకు విరోధులగు నీ బంధువులు వచ్చి నీతోస్నేహముగా యుందురు. నిన్నుయెడబాసియున్న అన్నయు నీతోగలసి ముచ్చటాడ రాగలడు. చాలాసుఖములే గలుగును. మంగళఫలము.

5 మంగళవారము మొదటిఝామము పడమర దిక్కునయుండి యడిగిన

నీ విరోధితో గలసి వానిని యే విధముననైనను మోసబుచ్చవలయునని వానితో కపటస్నేహము చేయుచున్నావు. ఈ కపటము వల్ల వానిని జయింపలేవు. వృధాకష్టముల ననుభవించవలదు.

6 మంగళవారము తొలిఝామము వాయువ్యమూలనుండి యడిగిన

యిదివరలో పలువిధములుగా ఆర్జించిన ద్రవ్యము దొంగలు దొంగలించుకొనిపోయిరి. ఆచింతచే రోగపీడితుడైతివి. నిన్నువిడచిపోయిన రొక్కము మరలిరాజాలదు. యిక కొద్దిదినములలో నీ సరీర జాడ్యము మానిపోవును. చోర ఆరూఢము

7 మంగళవారము తొలిఝామము. ఉత్తరదిక్కునయుండి యడిగిన

నీవు వొంటరివాడై కొంతపైకముచేకొని దక్షిణయాత్రవెళ్లుటకు ఆలోచించుచున్నావు. వొంటరివాడై పోవుటకు గానేరదు. నీ కుటుంబములో యున్నవారలు నీతోగలసి యాత్రపోవ నిశ్చయించుకొన్న తరువాత ఆదక్షిణయాత్ర ప్రయాణము కుదురును.

8 మంగళవారము తొలిఝామము ఈశాన్యమూలయందుండి యడిగిన

నీకు గల పుత్రుడు నీయందుచాలాప్రియముగలవాడు వాడతి బుద్ధిమంతుడు వాడు మంచికీర్తిని వహించగలడు. వానిచే సుఖము లందుదువు నీభార్యయుత్తమరాలు. ఆ బిడ ఈ దినము మొదలు శరీరారోగ్యములుగలిగి నీయందు అనురాగము గలదై యుండును. శుభ ఫలము.

9 మంగళవారము రెండవఝామము తూర్పుదిక్కునయుండి యడిగిన

ఇపుడు నీవు ప్రయత్నించియున్న వ్యాపారము అభివృద్ధి నొందును. నీకు ప్రియముగాయుండు స్నేహితుడొకడు యెర్రనిఛాయ

గలవాడై యుండును. వాని సహాయమున కొంతద్రవ్యము నీకుకై వల్య మయినరీతిగా వచ్చిచేరును న్యాయాధిపతి మూలముగా యిచ్చిన వ్యాజ్యము రాజీలోబడి నీవశమున జయముగలుగును చింతించవలదు శుభములే గలుగును.

10 మంగళవారము రెండవఝామము ఆగ్నేయమూలనుండి యడిగిన

నీవు కాపురమున్నయింటిలో వివాహకార్యమొకటి జరుగ బోవుచున్నది. స్త్రీవలన లాభము కలుగును నీవు కోనయల్లే మంచి నౌకరియు గుదురును. మంచిగుణమునిచ్చును. వొక ధనవంతుని సహాయమున నీవు శ్రేయస్సు పొందుదువు. సుఖములే గలుగును.

11 మంగళవారము రెండవఝామము దక్షిణదిక్కునయుండి యడిగిన

ఇతరులచేత చిక్కువడి కలహములు యెక్కువగా గలిగెను. అట్టికలహము కారణముగాగొని రాజాంగమున వ్యాజ్యముఖాంతరముగా ధనము నష్టము మనోకష్టములు గలిగి తల్లడిల్లుచున్నావు యింతయు నీ గోచారఫలమున గలగ్రహదోషమేగాని వేరుగాదు. యిక మూడునెలలు గడచిన తరువాత సుఖముగలుగును. మనస్సంకటములు పోవును.

12 మంగళవారము రెండవఝామము నైరుతిమూలనుండి యడిగిన

నివాసము చేయుటకై తగు స్థలమును క్రయమునకుగొన మనసులో దలచి వాటికి తగినంత ధనము ఖర్చుబెట్టి క్రయమును పొందుచున్నావు. యిది యేమికారణమని అడగవచ్చితివి నీయొక్క స్వబంధు వొకడు నీతోగలసియుండినట్లే యుండి ఈలాటి యిబ్బందిలో బడ ద్రోసియున్నాడు జాగ్రతగా యుండుము.

13 మంగళవారము రెండవజామము పడమరదిక్కునయుండి యడిగిన

ఈ సంవత్సరమున నీవు పెట్టిన పంటపైరులు అభివృద్ధినొంది చక్కగా ఫలమునిచ్చును. నీకుమారులలో పెద్దవాడగు తొలిపుత్రుడు శ్రేయసుగలవాడయి మంచివాడనుపించుకొని వివాహము గావించుకొనును. ఆ సమయమున నీకుశత్రువులగువారలు నిన్ను గౌరవపరచి మిక్కటముగా స్నేహముచేయుదురు. జయములే గలుగును.

14 మంగళవారము రెండవజామము వాయువ్యమూలనుండి యడిగిన

ఈ యా ఢఫలము దుఃఖకరమైనది నీవు నీభార్యతోకలహము పొందినదానివల భార్య లక్ష్యముంచదు. నీపుత్రులు ప్రత్యక్షవైరులై నిన్నెదురించుచున్నారు. నీవు నివాసముయుండు యింటనిన్ను యుండనీయక నీగ్రహచారఫలముచే అలయింపసేయుచున్నది. వొక ఫలము కుళ్ళిపోయినరీతి మనోచింతలు గలిగి కృశించుచున్నావు. పదునెనిమది నెలలు గడుపవలెను. ఆపై దినక్రమమున అనుకూలమగును.

15 మంగళవారము రెండవజామము ఉత్తరదిక్కునయుండి యడిగిన

స్ఫోటకమువలన తొందరబడుచున్న కష్టము యేలాగవునోయని ఆలోచించుచున్నావు. ఆ జీవునికి యేలాటికష్టమున్ను గలుగనేరదు నీవు తిరుపతి వేంకటేశ్వరులకు నియమించుకొన్న ప్రార్థన దీరని దోషమొకటియున్నది కాబట్టి ఆదేవుని పైభారమువైచి నమ్మకముతో యుండికట్టి ప్రార్థన చెల్లించెదనని చెప్పుకొనుము.

16 మంగళవారము రెండవజామము ఈశాన్యమూలనుండి యడిగిన

ఒకానొకబ్రాహ్మణోత్తముడు నీకు చెప్పినరీతిగా సస్యములు ఫలించే పొలమైనను పంచకట్టుకొనతగు భూమియైనను వచ్చిచేరును. యిదిమొదలు నీవు కోరినట్టి కోర్కెలన్నియు సఫలమగును. ఈ అంగారకుడు నీకు శుభఫలములే యిచ్చువాడని నమ్మికగొనుము.

17 మంగళవారము మూడవఝామము తూర్పుదిక్కునయుండి యడిగిన

గురువీక్షిణ్యముచేత శీఘ్రముగా వివాహము కుదురును. ఆ యువతి శిశువును గనును. యాగుసఫలముచే వొక్క సంవత్సరముల లోస్వతంత్రముగా వాసముసేయునట్టి స్వగృహమొకటి గలుగును. శుభములే గలుగును.

18 మంగళవారము మూడవఝామము ఆగ్నేయమూలయందుండి యడిగిన

గోచారఫలమురీతిగా శనిచాలనివాడాయెను. వానియొక్కచూపుచేత మూడు సంవత్సరములుగా కష్టములే పొందుచున్నావు. యిపుడు యీశ్వరుని దయచాలాగలిగియున్నది. యీనెలలో నీకష్టములు తొలగి సుఖము లనుభవింతువు భయములేదు.

మంగళవారము మూడవఝామము దక్షిణదిక్కునయుండి యడిగిన

నాలుగుకాళ్ళ జీవుడొకటి జాడ్యముచే త త్తరబడుచున్నది. ఆయది చాలాకృశించి మరణము సమీపమునుజూచుచున్నది. అది జీవించు టరుదు. నీమనోచింతల నివారించుకొనుము.

20 మంగళవారము మూడవఝామము నైరుతీమూలనుండి యడిగిన

నీర క్తస్పరిసగల స్వబంధుదూర దేశమున యుండుటచే అచ్చోటి కుశలములు దెలియక తపించుచున్నావు. యిక నెలదినములలో అచటి శుభవా ర్తలున్ను కుశలములున్ను దెలియవచ్చును సందేహము వలదు.

21 మంగళవారము మూడవఝామము పడమరదిక్కునయుండి యడిగిన

వివాహము గావించుకొనుటకై వొకకన్యను పశ్చిమదిక్కున యుండేగ్రామమున గోరియున్నావు. ఆ కన్యకు యేయొక్కదోషమున్ను లేదు. ఆ కన్యను పెండ్లాడుటచేత ధనలాభమున్ను గలుగును నేలలు

కుదురును. కులమునకు మేలుగలుగును. యిదినమ్మకము విడువ వలదు.

22 మంగళవారము మూడవర్ఘూమము వాయువ్యమూలనుండి యడిగిన

శరీరారోగ్యములుచెడి వ్యాధిగ్రస్తుడై చాలాతపించుచున్నావు మరియు నీతోడబుట్టువుతో కలహించుకొని వానిని విడచిదూరముగ యున్నావు. యిట్టికష్టములు యెంతకాలముండునని తలచివచ్చినావు యెనిమిదినెలలు గడచిన పిదప నీ కష్టములు నివర్తియై సుఖము పొందుదువు.

23 మంగళవారము మూడవర్ఘూమము ఉత్తరదిక్కునయుండి యడిగిన

ఒకబుల్లివాడు గానక వాడెందుయున్నాడోయని దుఃఖించుచు అలయుచున్నావు. ఆ పిల్లవాడు ఆగ్నేయమూలయందు వెళ్ళియున్నాడు. నీవు యీదేసమయము ఆదిక్కుజూడ పోయిచిజూచితివేని పిల్లవాడు నీకు వశపడుదుడు. భయమొందవలదు.

24 మంగళవారము మూడవర్ఘూమము ఈశాన్యమూలనుండి యడిగిన

చేతిసొమ్ము కానకపోయిన చింతచేత అలమటపొంది యడిగె దవు. ఆ సొమ్ము నెలదినముల లోగా నీభార్యమూలముగా బయట బడును. సొమ్ముచిక్కును భయమొందవలను.

25 మంగళవారము నాలవర్ఘూమము తూర్పుదిక్కునయుండి యడిగిన

స్వతంత్రమైయున్నభూమి యొకనిచేత చిక్కుబడినందుచే ఆ చోటికి నిన్ను రానీయక శ్రమబెట్టుచున్నాడు, యితరుడైన వొక మనుష్యునిచే సమాదానము గావించబకును. యెప్పటియట్ల నీభూమి నీచేత చిక్కుబడును. సందేహించవలదు. వారము దినములు గడప వలెను. నమ్మికగొనుము.

26 మంగళవారము నాలవఝాములు ఆగ్నేయమూలనుండి యడిగిన

ఈ ప్రశ్నవలన గలిగిన యారూఢ ఫలము జయప్రదమగును. వివాహము గావించుకొనుటకై మూవురుకన్యలజూచి యున్నారు ఆ కన్యకలలో దక్షిణదిక్కునయున్న కన్యను పెండ్లాడినటులయితే ఆ పడుచువల్ల కుటుంబక్షేమమున్ను ధనలాభమున్ను కలుగును. సుఖములే క్రమముగా చేకూరును.

27 మంగళవారము నాలవఝాములు దక్షిణదిక్కునయుండి యడిగిన

ఒకనిచేత చిక్కుడిడి చాలాకష్టముల ననుభవించుచున్నావు అట్టి కష్టములు యెన్నడు తొలగునోయని రేయుంబవలు చింతనసేయుచున్నావు యిక కొద్దిదినములలో వానికే మంచి బుద్ధి గలిగీ నీచిక్కు విడదీయుచున్నాడు అది మొదలు సుఖముల పొందుదువు.

28 మంగళవారము నాలవఝాములు నైరుతిమూలనుండి యడిగిన

ప్రస్తుతము నీవు జీవించునట్టి యుద్యోగమున నీ బ్రతుకు చెడుపుటకై నల్లటివాడొకడు బ్రవేశించి అందుండనీయక చెరుపు చేయుచున్నాడు వానిచే మనోచింతలు గలవాడైతివి. యిక రెండు నెలలు గడపిన తరువాత వానివిరోధము తొలగిపోవును. నెమ్మది గలిగి యుందువు.

29 మంగళవారము నాలవఝాములు పశ్చిమదిక్కునయుండి యడిగిన

ధాన్యాదిఫలములు ఫలించును. రాజాంగమున బెట్టిన వ్యాజ్యము నీ కనుకూలముగావచ్చును. నీతో కలహించుకొని కోపముతో యున్న యింతి యెప్పటియట్ల సఖ్యముగా యుండనేర్చును. నీతో కలహము జేసి నిన్నెడబాసిన సహోదరుడు వచ్చి చేరగలడు. సందేహమువలదు, శుభమే గలుగును.

30 మంగళవారము నాలవర్ఘూాస్తము వాయువ్యమూలనుండి యడిగిన

ఇదివరలో నీస్వాధీనమునయున్న సొమ్ము చేయివిడిచిపో నందుచే ఆ సొమ్మువచ్చునారాదాయని యడిగెదవు నిన్నువిడనా పోయినసొమ్ము మరలి వచ్చునట్టి మార్గమేదియు అగుబడదుగా యిది కష్టతరమైన యారూఢఫలము అప్రయోజకము.

31 మంగళవారమునాలవర్ఘూామము ఉత్తరదిక్కునయుండి యడిగిన

నీచేతయుండిన సొమ్మును నీతోగలసి స్నేహముగాయున్నవాడు యీ సొమ్మును అపహరించియున్నాడు. అందుచే చాలా చింతపడి కృశించుచున్నావు ఆసొమ్మునీచేత ముట్టుటదుస్తరము.

32 మంగళవారము నాలవర్ఘూామము ఈశాన్యమూలనుండి యడిగిన

జీవించుటకై వొకనౌకరిని గోరియున్నావు ఆనౌకరియందుగల వొకడు నీకు స్నేహితుడై నిన్నాయుద్యోగమున నిలకడ నుండసేయును నీకు చాలినంతధనమున్ను వచ్చిచేరును. దిక్రమమున మేలే గలుగును భయమొందవలదు.

మంగళవార ఫలము

ముగిసినది.

---

1 బుధవారము తొలిఝూామము తూర్పుదిక్కునయుండి యడిగిన

ఒకనికి వివాహము గానించుటకై నీమతి ప్రియముతో యాలో చించియున్నావు అట్టి వివాహము శీఘ్రకాలమున భగవంతుని సంక ల్పమున కూడివచ్చు చున్నది. ధయిర్యముగాయుండి అప్పుగొన వచ్చును. ఆ రుణము శీఘ్రముగా దీరిపోవును. నీకు మంచి కీర్తియు గలదు.

2 బుధవారము తొలిఝామము ఆగ్నేయమూలనుండి
యడిగిన

నీవు పాణిగ్రహణము చేసుకొన్నభార్యవల్ల చాలా చిక్కులు బడి రాత్రి పగలు అదేచింతచే తపించుచున్నావు. ఆ భార్యవలన నీ తలుదండ్రులు బంధువులు మిత్రులు సహోనీయందు అసహ్యపడి విరోధముల పూనియున్నారు. యివియే నీ మనసును వ్రణము గావించి రోగమును గలగజేసియున్నది. యీ యారూఢము చాలా దుఃఖ ఖరము.

3 బుధవారము తొలిఝామము దక్షిణదిక్కునయుండి
యడిగిన

గృహమునందు వాసముగాయుండే యొక సుదతిబోధనవలన నీకొమార్తె నీయందు వెగటుగలిగి కలహములే సేయుచుండును. కొమార్తె పగరాలయినందున నీవు మనోచింతలుగలిగి తపించుచున్నావు. నీయింటనున్న ఆ యాడదాని తొలగజేసిన తరువాత కలహములకు మార్గము యేర్పడదు. నెమ్మదిగొనియుందువు.

4 బుధవారము తొలిఝామము నైరుతిమూలనుండి
యడిగిన

నీవు జీవించుచున్న స్థలమును విడచిబెట్టి తత్తరబడుచున్నావు. అట్టి జీవనము మరలియెన్నడు రాగలదోయని దలంచుచున్నావు. ఆ నౌకరి ఆ నౌకరి నీవల్లనే పోగొట్టుకొంటివి. యది గోచారఫలము ఆలాగు గావించినది. యా గ్రహదోషము యెనిమిది నెలలు యున్నవి. అది గడచిన యంత తనంతట యుజ్జీవించదగిన నౌకరి కుదురును సుఖమగును.

5 బుధవారము తొలిఝామము పడమరదిక్కునయుండి
యడిగిన

ఈ చిన్నతనమునసే నీ పిల్లవాని బడిలోయుంచుట చాలా మంచిది. నీ మనసున దలచియున్నకార్యము చేయబూనినయెడల సఫలమగును, నిన్నుయెడబాసియున్న దవ్యము న్యాయాధిపతి చెంతచేరక

చే నీకనుకూలముగా వశమయి పొందగలవు. యివియన్నియు శుభఫలములుగాన యిది మొదలు మేలేయగును.

6 బుధవారము తొలిఝామము వాయువ్యమూలనుండి యడిగిన

అశుభవార్తయొకటి మనుష్యుని మూలమైనను కాకిత మూలమైనను పశ్చిమదిక్కునయుండి వచ్చును అదివిని మనసున చింతనొందుదువు. దేశాంతరము వెళ్ళిన నీ సోదరుడు శీఘ్రకాలములో వచ్చి చేరగలడు. వానికి గావలసి శైత్యోపచారములు నీవే చేయగలవు. నీకుగల గల సొమ్ముస్వల్పమైయున్నను యెక్కువగా ధనలాభము పొందగలవు మంచిఫలము.

7 బుధవారము తొలిఝామము ఉత్తరదిక్కునయుండి యడిగిన

కష్టతరమగు యీ ఆరూఢఫలముచే కుటుంబమున గొప్ప కలహము యేర్పడినందుచే చాలాదుఃఖమును పొందుచున్నావు. నీ భార్యమూలముగా వ్యాజ్యమున ద్రవ్యనష్టము గలిగినది. కుటుంబ కలహమున్ను ద్రవ్యనష్టమున్ను గలుగుటకు నీభార్యయే కారణముగాన నీబుద్ధినిగొని దినక్రమమున యివియెల్ల శాంతి గావించుకొనవలెను. అరువది దినములు పోనియ్యవలెను.

8 బుధవారము తొలిఝామము ఈశాన్యమూలనుండి యడిగిన

నగలునాణ్యము పెట్టియుండుచోటెరిగిన వొకడు తోడుదొంగయైయుండి అవియెల్ల అపహరించియున్నాడు. ఆ సొమ్ము వచ్చునా రాదాయని అడుగదలచివచ్చితివి. సొమ్ము లపహరించినవాడు అతి భయంకర పటాటోపములు గలవాడు. చాలాసామర్థ్యపరుడు పిల్లివాతబడిన యెలుక బ్రతుకనేరదు. ఆ సొమ్ము వచ్చునని కలలోనైన తలపనిలేదు.

9 బుధవారము రెండో జామము తూర్పుదిక్కునయుండి యడిగిన

ఒకానొక ఆడపడుచుతో కలహము గావించుకొనిన మనస్తాపముచే యిలు విడచి యాత్రగా పరదేశము పోవదలంచి ప్రయాణము కుదిరించుకొనవచ్చితివి. నీప్రయాణము అశుభఫలము గలుగజేయును. పోయిన చోటందునైనను సుఖముగలుగదు దాని కన్నీరు నిన్ను వెన్నంటివచ్చి కష్టపరచును ప్రయాణము విడచిపెట్టుటయే చాలా మంచిది.

10 బుధవారము రెండవఝామము ఆగ్నేయమూలయందడిగిన

శిరమున బడిన బల్లివలన యేది కష్టములు వాటిల్లునోయని సంశయించి అడిగెదవు. దానిఫలము యేమనగా కొద్దిగా కలహమును జావునుగాని మరణావస్థలురావు.

11 బుధవారము రెండవఝామము దక్షిణదిక్కునయుండి యడిగిన

మంచివాడని దలచి వానితో చాలా ప్రియముగా స్నేహము చేయుచుంటివి వాడతిహీనబుద్ధియు హీననడవడికయుగల కపటచిత్తుడుగా నీకు దోచకపోయెను. వాడుచేయుసట్టికార్యములచేతను వాని జాడలచేతను దుష్టుడని గుర్తెరిగియు వానిస్నేహము వదలకున్నావు యికమీదటనైనా వాని సహవాసము విడచిపెట్టుము.

12 బుధవారము రెండవఝామము నైరుతీమూల యడిగిన

నీయిల్లాలికి ఆభరణములు సేయదలంచి కొంతరొక్కమును వొకని చేతికిచ్చి పదిలపరచితివి. వాడు ఆధనమును యియ్యగలడా దగాచేయగలడా యని సందేహించెదవు వాడు ఆభరణము చేసి యివ్వడు పైకముమాత్రము యియ్యగలడు. అయితే అప్పటప్పటికి వానిని హెచ్చరికచేయుచుండవలెను.

13 బుధవారము రెండవఝామము పశ్చిమదిక్కునయుండి యడిగిన

ఒక స్త్రీవచ్చిచేరును దానివలన నీ మనోచింతలు నివారణ యగును. నీవు వుజ్జీవించుస్థలమున యొకడుండి విరోధమును గలిగించు చుండెను అట్టి విరోధములు తొలగిపోవును. నీ నౌకరి నీకేగలుగును ధైర్యము విడువరాదు మేలేయగును.

14 బుధవారము రెండవఝామము వాయువుమూలనుండి యడిగిన

నీ స్వబంధువర్గములుగూడి నీకు శుభకార్యము కలిగించవలె నని శుభముహూర్తమున వొకకన్యనుదెచ్చి వివాహముగావింతురు. వారి మూలముగా దినక్రమమున నీకు మేలేగలుగును. కుటుంబము వృద్ధియగును జాగ్రతగా యుండవలెను.

15 బుధవారము రెండవఝామము ఉత్తరదిక్కున ఫలమడిగిన

ఒకబ్రాహ్మణోత్తముని సహాయమున కొంత ద్రవ్యము నీకు గలుగును. ఆ ద్రవ్యముగొని భూములుగొని భార్యపిల్లలుతో సుఖ జీవనమున యుండకలవు. లోకమునగల జనులకందరికి మంచివాడ నియు కీర్తియున్ను ఆర్జింతువు శుభఫలము.

బుధవారము రెండవఝామము ఈశాన్యమూలయందుండి ఫలమడిగిన

చేయిజారవిడచిన ద్రివ్యమువెప్పటియట్లవచ్చిచేరుటయేగాక నీశరీర మున గలరోగము ఔషధప్రయోగమువల్ల నివర్తియగును. అందరికి మంచివాడై కీర్తితో ప్రవర్తింతువు.

బుధవారము మూడవఝామము తూర్పుదిక్కునయుండి నారూఢమడిగిన

తలచిపోవునట్టి కార్యము నీకు అనుకూలమగును ఒకగొప్ప మనిషి నీకు సహాయుడైయుండగలడు. యాతనిమూలముగా నైరుతి దిక్కునయుండి మంచి శుభవార్తయొకటి రాగలదు. గోరికగా గో

నట్టి ఆభరణములు నీచేతికివశమయి వచ్చును. వచ్చినదానియందు భక్తిగలిగి దాని భద్రపరచుకొనవలెను.

18 బుధవారము మూడవఝామము ఆగ్నేయమూల
ఆరూఢము.

నీపిత్రుయుంచిన ధనము నీకు రావలయునని యాశగొని నీచేతిలోని ధనమును ఖర్చిడినావుగాని ఆసామ్మెల్లరాగోరుటచే ప్రయోజనములేదు. మునుపటిమామూలు ఏలాగో ఆలాగేయగును. యిందుకై ధనము వ్రయముచేయవద్దు.

19 బుధవారము మూడవఝామము దక్షిణదిక్కు
ఆరూఢము

ఒకని నమ్మివానిమూలముగా వ్యాపారముచేయదలచి వచ్చితివి. ఆవ్యాపారము నడపవచ్చునుఆతడే సహాయపరుడై యుండగలడు ననీనవ్యాపారమునలనతోలుతఅధికముగాలాభముకలుగదు. లాభము యెక్కువగా రాలేదని విడచిబెట్టి మోసముబోరాదు. నమ్మకముగా వ్యాపారమున కాపుదలై యుండవలెను.

బుధవారము మూడవఝామము నైరుతీమూల
నారూఢము

ప్రస్తుతము నీవు కాపురముండు యిల్లు నీకు శత్రువైయున్నది. కాబట్టి నీవు బుద్ధిమంతుడవై ఆయిల్లువిడచి మరియొకయింట వాసము సేయుటచే శ్రేయము గలుగును. యేలాగైనా మూడు నెలల లోపల దాటుకోవలెను. దాటినతరువాత సుఖము గలుగును.

21 బుధవారము మూడవఝామము పశ్చిమదిక్కు
నారూఢము

నీయింటనున్న వస్త్రమొకటి కానకపోయెను అదికానకపోయినందుచే కష్టబడుచున్నావు. ఆ వస్త్రము వచ్చునా రాదాయని అడుగుచున్నావు నీయిలుదాటిపోయిన వస్త్రము నచ్చేదిలేదు అందుకై ద్రవ్యము ఖర్చుబెట్టవద్దు.

22 బుధవారము మూడవఝామము
వాయువుమూల నారూఢము

ఇపుడొక లక్షణవంతముగలఆవునుగొంటివి ఆగోవువలనపాలు అభివృద్ధియగును. కుటుంబమున క్షేమములే గలుగును. దినక్రమమున మేలగును. ఆగోవును దైవముగా భావించి దాని రక్షించవలెను. సుఖము గలదు.

23 బుధవారము మూడవఝామము ఉత్తరదిక్కు
నారూఢము

యీ సంవత్సరమున నీవు గావించిన పంటపైరులు అభివృద్ధి నొందును. నీవు దలచినకార్యములు అమితఫలము యియ్యకపోయినను మధ్యముఫలమొసగును. వొకరివల్ల నీకు మంచికీర్తియు ఆదాయమును గలుగును. వారిచే సుఖముల పొందుదువు.

బుధవారము మూడవఝామము ఈశాన్యమూల
యారూఢము.

ఒకనినమ్మి వానిచేతిధనము నీచేతికిరాగోరుచున్నావు అతడు యిచ్చుటరుదు. నమ్మవద్దు ఆతనికై నీచేతిరొక్కమును ఖర్చుబెట్టవద్దు నష్టముగలుగును. నష్టఫలము.

25 బుధవారము నాలవఝామము తూర్పుదిక్కు
నారూఢము

నీచేతి ద్రవ్యమును వొకనికిచ్చి వాడు చెప్పినకాలముల కెల్లి పోవుచున్నావు. వాడాధనమును యిచ్చునా యియ్యడాయని సందేహమునవచ్చితివి. నీవడిగిన యారూఢమువల్ల నీచేయిజారిపోయినద్రవ్యము వాడై బిలచియియ్యగలడని దలచవద్దు న్యాయస్థానమునకు పోయిన తరువాత వచ్చును. సందేహంవలదు.

26 బుధవారము నాలవఝామము ఆగ్నేయమూల
ఆరూఢము

ఒక ఆడదానివల అధికముగా కలహముగలిగినది ఆకలహమున వొకపురుషుడు అడ్డుగావచ్చి వానికి నీకు విరోధము గలిగియు

న్నది. అట్టి విరోధము ముప్పదిదినములు గడచినతరువాత నెమ్మది పుట్టి సుఖము గలుగును. శత్రుఫలము.

27 బుధవారము నాలవఝాామము దక్షిణదిక్కు
ఆరూఢము

ఇదిచోర ఆరూఢము యీ యారూఢమమున నీయింట దొంగ లుప్రవేశించి నగలునాణ్యములు అపహరించిపోయిరి అందుచే మనో చింత లెక్కువై యున్నవి. నీభార్య యీ దుఃఖముచేతనే రోగపీడితు రాలై తపించుచున్నది. యారోగము తక్కువజాతి వైద్యునిచే మాని పోవును. యదినిజము.

28 బుధవారఘు నాలవఝాామము నైరుతీమూల
యారూఢము

సంతానఫలమారూఢము నీ సతికి ఐదుశిశువులు గలుగున అం దుఆడబిడ్డలు ముగ్గురు మొగ పిల్లవాండ్రు యిద్దరుగా వృద్ధిపొందు దురు. స్వబంధువుల నీకు వశమై కుటుంబమునగలసి యుందురు. క్షే మములె గలుగును. శుభఫలములు.

29 బుధవారము మూఢవఝాామము పశ్చిమదిక్కు
నారూఢము

బంధువులలో నొక్కనిచే కలహముపొందిన మనస్సంకటము పూర్ణముగా యుండబట్టి యీచోటవిడచి యితరదేశములకు పోవు టకై వొకస్నేహితుని తోడు గోరియున్నావు. వానినమ్మట ప్రయో జనములెదు. వాడు నిన్ను మోసబుచ్చును. వొంటరివాడై పోజాలవు కష్ట ముల పొందుదువు. ప్రయాణముచాలించుము.

30 బుధవారము నాలవఝాామము వాయువుమూల
యారూఢము.

ఆడదానియొక్క దుర్బోధనతలకెక్కి యింటయున్నవారినెల్ల విరోధులుగా జేసుకొంటివి. దానివలన చేతిడబ్బులనెల్ల ఖర్చుచేసి కొంటివి. పొయినధనము రాబోదు. యిది మొదలు నీకును నీకుటుంబ

మునకును సుఖములు గలుగును. యెప్పటియట్ల ధనము సంపాదింప గలవు.

31 బుధవారము నాలవఝామము

ఉత్తరదిక్కారూఢము

ఒక యువతీరత్నము యిలువచ్చి చేరును. ఆయువతివల్ల అనేకుల స్నేహము గలుగును. దినక్రమమున ధనము లభివృద్ధియగును. నితో వితండములాడుచు విరోధములే సాధించుచున్న నీ బంధువులు స్నేహితులు అందరున్ను నీవశమై నీచేతి ధనములకు యెదురుచూచుచుందురు. గావున నీవారిని నమ్మవద్దు వారియెడల జాగ్రతగాయుండి కాలము గడుపుము. వొకస్త్రీవలన నీకింత లాభముగలదు. ఆ బిడిను విడువరాదు.

32 బుధవారము నాలవఝామము

ఈశాన్యదిక్కారూఢము

ఇపుడుండేయిల్లు దరిద్రము నిచ్చుచున్నదని వేరేవొకగృహము జేరుటకై యాశగొని అడిగెదవు. యీస్థలమువిడచిపోవుటచేనీ కేదియు లాభములేదు. యీచోటుననే రెండునెలలు ఆగితివేని చాలసుఖములే నొసగును. నీగోచారము చెడ్డదిగాని యింటివలన దోషములేదు. తలపు విడువుము.

బుధవార మారూఢము

ముగిసెను.

---

గురువారములేక - లక్ష్మీవారము

1 తొలిఝామము

తూర్పుదిక్కారూఢము

సేవకుడొకడు నీ చెంతయుండినీకు కీడు గలుగజేయుచున్నాడు. వానివలన దుఃఖమేగాని సుఖమునుపొందలేదు. అపకీర్తియు అపనింద మొదలగు చెడ్డఫలములు పొందుచున్నావు. ... యింకయుఁ యొద్ది

దినములు వాని నీవశమునయుంచుకొన్నయెడల యింతకన్న యెక్కుడు కష్టఫలము లనుభవింతువు వానిని శీఘ్రముగా వెళ్ళగొట్టుము. యీ మాట నమ్ముము.

2 లక్ష్మీవారము తొలిఝామము

ఆగ్నేయమూల నారూఢము

ఇంటిలోనిపోరు యింతింతని బలుక శ్యముగాదు లోకమున నీ బంధుమిత్రాదులు నిన్ను వెగటునజూచి వారలందరు విరోధులై యున్నారు. యిట్టికష్టకాలము యెన్నడు నిన్నెడబాసిపోవునని యడుగ వచ్చితివి. నీ గ్రహఫలము నిన్నలయింప జేయుచున్నది. యింకయు యెనిమిదినెలలు యీ కష్టము లనుభవించేగావలయు. ఆపైదినక్రమ మున అన్నివిధముల సుఖములు గలుగును.

3 లక్ష్మీవారము తొలిఝామము

దక్షిణదిక్కారూఢము.

నీమాట లంగీకరించక నిన్నెదుర్కొని మాటలాడదగిన భార్యను పొందియున్నావు. ఆ బిడచే నీ బంధువులందరు నిన్నెడబాసి రాకలుపోకలు మానియున్నారు. వారలు నీయందు యేదియో వొక నెపము గల్పించుచున్నారుగాన నీవు అతి జాగ్రతగా యుండవలెను. విరోధఫలము.

4 లక్ష్మీవారము తొలిఝామము

నైరుతీమూలారూఢము

ఇన్నిదినములు చాలా కష్టములు బడినందుచే శరీరమున రోగ మున్ను బలహీనమున్నుగలిగి ప్రవర్తించుచుంటివి అట్టి కష్టకాలము యివుడు నిన్నెడబాసిపోయినది. నీవు దలచి చేయబూనినకార్యములు నీవశమగును. నీ స్నేహితులు యెప్పటియట్ల ప్రియమున వర్తింతురు.

5 లక్ష్మీవారము తొలిఝామము

పశ్చిమదిక్కారూఢము

తానసుమమకారమున వారులను లక్ష్యముంచకయున్నగర్వము నిన్నే చెడిపెను. ఆకారమున నీచేతిగొక్కమెల్ల పలుదెరగుల పాడు

చేసితివి. నీవారలు నిన్నువెడబాసిన దుఃఖమొకటి చేతిరొక్కము పోయిన చింతయొకటి యివియన్నియుగూడి నిన్నలయించి రోగము నకు దీసుకవచ్చెను. యిది అహంకారఫలము.

6 లక్ష్మివారము తొలిఝామము
వాయువ్యమూలారూఢము.

ఈ సంపదయెన్నటికి యీలాగేయుండునని ధనమీద అలక్ష్య భావముంచి నీచేతిరొక్కములను లోకులకు దారబోసితివి. ఆకారణ మున ధనము వ్రయమై చాలాయిబ్బందిలోబడి నలువైపుల రుణస్థు డయితివిగాని మరేదియు నగుబడదు యిపుడు తీరని దుఃఖమునయుండి ఆలోచించుచున్నావు. యిది అలక్ష్యభావఫలము.

7 లక్ష్మివారము తొలిఝామము
ఉత్తరదిక్కారూఢము

ఈ ఆరూఢమువల్ల యిదివరలో నష్టఫలముల ననుభవించు చుంటివి యిక కొద్దికాలము గడపినయంత ధనధాన్యములు వచ్చి చేరును. నీబంధుమిత్రాదులు నిన్నసరింతురు అదిమొదలు శుభములు గలుగును. యిది శుభఫలము.

8 లక్ష్మివారము తొలిఝామము
ఈశాన్యమూలారూఢము

ఒకానొక వ్యాజ్యము హటాత్తుగా వచ్చి యామూలమున ధన వ్రయము శరీరకష్టముదాన్య నష్టము గలిగియున్నది. యీ కష్టభా రము నిన్నెడబాయుడకు కొద్దిదినములు గడచినయంత తనంతట యా వ్యాజ్యము నీపక్షమున చేకూడివచ్చును. సుఖము నొం దుదువు.

9 లక్ష్మివారము రెండవఝామము
తూర్పుదిక్కారూఢము.

అగ్నిచేత దగులబడిన గృహమునకును వస్తువులను దలచి దుఃఖించుచున్నావు. అదేరోగమున నీ శరీరమున యేవిధమైన జాడ్యము

లేదు. యిట్టి కష్టములన్నియు నీయిల్లాలివలన తొలగిపోవును. ఆపై మేలు గలుగును. అగ్నిభయారూఢము

10 లక్ష్మీవారము రెండవర్ఘామము
ఆగ్నేయమూలారూఢము

నీవడిగిన ఆరూఢఫలము అష్టమశని వచ్చినమొదలు నిన్నల యించి చేతిధనమున్ను పోగొట్టి అందరికి అలక్ష్యము గావించినది యిట్టికష్టము రెండు సంవత్సరములు వెళ్లినదే యీ దుర్భలస్థితి నిన్ను విడచిబోవును. ఆపై మేలు గలుగును. శనిఫలము

11 లక్ష్మీవారము రెండవర్ఘామము
దక్షిణదిక్కారూఢము.

ఒకనియందు నమ్మకముగొని వానిమూలముగా వుజ్జీవింతమని దలంచియున్నావు. వాని నమ్మవద్దు రాజులవల్ల నీకు ఫలముగలదు వారిగుండా నౌఖరిస్థిరముగా యుండును. ధనవ్రియము చేయవద్దు శరీరకష్టములను పొందవద్దు సుఖమేగలుగును.

12 లక్ష్మీవారము రెండవర్ఘామము
నైరుతీమూలారూఢము

నీవు విడచియున్న నౌకరి యెప్పటియట్ల నీకేవచ్చిచేరును యిల్లు విడచిదాటిన ఆడది ఎప్పటియట్ల సుఖముగా వచ్చిచేరును. ఆయింతి నీరక్తసంబంధమున గలసినదిగాని యితరముగాదు. అయినను నీకు టుంబమును కలహము గావింపదగిన యొక జైస్త్రీ నీ వెంటనేయున్నది. దానిచే కొంతకష్టము ననుభవింతువు గాన దానిని తొలగనేయుము. సుఖముగలదు.

13 లక్ష్మీవారము రెండవర్ఘామము
పశ్చిమదిక్కారూఢము

ఒక స్థలమున నవీనముగా యిలుగట్టదలచి వచ్చితివి. ఆ స్థల మున యిల్లుగట్టరాదని వొకడు శనిగ్రహమువలె అడ్డబడి ఆక్షే పించుచున్నాడు. యిట్టి అసందర్భముపై బెట్టుకొని ఆచోటయిల్లు

గట్టవగ్గు మించి కట్టితివేని సుఖములేదు ధనము శరీరకష్టము నష్టమగును.

14 లక్ష్మీవారము రెండవఝామము
వాయువ్యమూలారూఢము.

ఒక స్త్రీ ప్రవేశించి కలహమునకు ఆస్పదముగా నిలచి నీయందు అపదూరు నిర్ణయించి నిన్ను తపింపచేయుచున్నది. ఆకష్టభరము భరించలేక వచ్చి యడుగుచున్నావు. వొక పురుషుడు వచ్చి యా మర్మముల దెలిసికొని నీకు మేలు గావించును. భయమొందవలదు.

15 లక్ష్మీవారము రెండవఝామము
ఉత్తరదిక్కారూఢము

ఇంతకాలము చేతికష్టమువల్ల పనులుచేసి జీవించుచుంటివి. అట్టిపనిలో ఆదాయములేక యాకార్యము విడచిబెట్టి పిచ్చుబట్టినవానివలె ఆలయుచున్నావు. భయమొందవలదు. ఎనిమిది నెలలు ఎనిమిది దినములు గడచిన తరువాత నీచేతిపనులె నీకు కైవల్యమగును. అది మొదలు మేలగును.

16 లక్ష్మీవారము రెండవఝామము
ఈశాన్యమూలారూఢము

గురువు రెండవయింటనుండుటంబట్టి చాలాకష్టములె యిదివరలోఅనుభవించుచుంటివి. నీకు అన్యులచేతను స్వబంధువులచేతను స్నేహితులచేతను వుపకార మేమియు గలుగలెదు. నీమిత్రులందరు శత్రులైయున్నారు. యికమూడునెలలుగడపితివేని యీ కష్టములన్నియుతొలగిబోవును. సుఖములు గలుగును.

17 లక్ష్మీవారము మూడవఝామము
తూర్పుదిక్కారూఢము

నీ విపుడు యడిగెడు యారూఢఫలమువలన ఉత్తరదిక్కునుండి శుభవార్తయొకటి వచ్చును. నీవు జీవించుచున్న సౌఖరి స్థిరముగా

యుండును. పరులకు స్నేహితులై గలసియుందురు. నీకష్టములన్నియు తొలగి పోయెను. మంచి కీర్తియు మంచి ఫలమును లాభమును పొందుదువు.

లక్ష్మీవారము మూడవఝామము
ఆగ్నేయమూలారూఢము

నీ వడిగినప్రశ్నవలన యిదివరలో అష్టవిధములగు కష్టముల ననుభవించితివి అట్టికష్టములు యెన్నడుదీరును. వుజ్జీవించునట్టి మార్గ మెపుడు గల్గుననే సంశయము చాలాగలదు. వొక స్నేహితునివల్ల నీ కష్టములు నివారించును. యిక నెలదినములకు మంచియే గలుగును భయమొందవలదు.

19 లక్ష్మీవారము మూడవఝామము
దక్షిణదిక్కారూఢము

ఒకస్నేహితునిగూడి అతనితో యాత్రసలుప సందేశించియు న్నావు. అతడు నీకు చాలాహితుడుగావున ప్రయాణము సిద్ధపరచుకొని పోవచ్చును. మంచి ఫలము.

20 లక్ష్మీవారము మూడవఝామము
నైరుతీదిక్కారూఢము.

మీ పిల్లవాడొకడు మీతో కలహముజేసి యిల్లువిడచి దేశాం తరిమై పోయియున్నాడు. వాడుండుచోటు దెలియక తపించుచున్నారు. యిప్పుడు అగ్నిమూలగా పోయియున్నాడు. వాడొకమిత్రునిగూడి మాట్లాడుచున్నాడు యిదేక్షణము వెళ్ళినయెడల వానిని బట్టి దేవచ్చును.

21 లక్ష్మీవారము మూడవఝామము
పశ్చిమదిక్కారూఢము.

పరస్త్రీగమనమువల్ల నీశరీరమున గలిగినరోగము దీరకయు న్నది యాజాడ్యము నిన్నువిడచి యెన్నడు పోవునోయని చింతలోబడి తపించుచున్నావు. తగుమైన ఔషధము సేవించినచో యిక రెండు నెల లకంతా రోగముమానును భయమొందవల్దు.

### లక్ష్మీవారము మూడవఝామము
### వాయువుమూలారూఢము

నీభార్యమాటలనువిని నీ తలిదండ్రులతో కలహము జేసికొని వారలకు విరోధివైతివి. వారిపాపమునిన్ను చుట్టుకొనినందుచే నీనౌకరియు పోయెను. పరులునిన్ను అలక్ష్యముగా జూచుచున్నారు. యికనైన భార్యమాటల వినక బుద్ధితో జీవించుము. మేలగును. యిది నిజము.

### 23 లక్ష్మీవారము మూడవఝామము
### ఉత్తరదిక్కారూఢము

దేవునికి ప్రార్థనచేసికొని దేవళమునకు పోవుటకై ధనమును చేర్చితివి. ఆధనము దొంగలపాలాయెను. పోయినధనము రాజాలదు. మొక్కుబడియు చెల్లలేదు. యిది బుద్ధిమోసమున పోయెనుగాని దెలిసి దారపోయలేదు.

### 24 లక్ష్మీవారము మూడవఝామము
### ఈశాన్యమూలారూఢము

నీభార్యకునీకును కలహము గలిగి తానై న్యాయాధిపతివద్ద వ్యాజ్యమును బెట్టియున్నది. ఆ వ్యాజ్యము నీవంక అనుకూలమా ప్రతికూలమా యని యడిగెదవు. మీకిరువురకు మధ్యనొక స్త్రీయుండి కలహము పోనిచ్చి సమాధానపరచును.

### 25 లక్ష్మీవారము నాలవఝామము
### తూర్పుదిక్కారూఢము

చేతిసొమ్ము నిన్నువిడనాడి పోయినందుచే చాలావ్యసనము దగిలి తపించుచున్నావు ఆ సొమ్ము నీయింటగల వొక ఆడుదాని వశమున యున్నది. ఆ యింతి నిర్భయురాలు గావున నీసాహసముచే మంత్రతంత్రములుచేసెదనని చెప్పితివేని అప్పటికి నీ సొమ్ము వచ్చి చేరును. ఆ యువతిని యెన్నటికి నమ్మవద్దు.

లక్ష్మీవారము నాలవఝామము
ఆగ్నేయదిక్కారూఢము

గురుబలము లేనందుచే వొకడు నీతో దీర్ఘకాలముగా విరోధమును మనసాయుంచుకొని నిన్ను చెరపగోరియున్నాడు. వానిని యెన్నటికిని నమ్మవద్దు. వానిస్నేహమువల్ల చెడ్డఫలమే గలుగుటయేగాక ఆపదలు సంభవించును జాగ్రతగా యుండవలెను.

27 లక్ష్మీవారము నాల్గవఝామము
దక్షిణదిక్కారూఢము

నీ పుత్రునిబడిలో యుంచుటకును వ్యాపారము చేయుటకును యుద్యోగమునకు పోవుటకును యీమూడు ప్రశ్నలుగూడిన యారూఢము అడిగినావు. పిల్లవాని బడిలోయుంచిన విద్యలో వృద్ధి పొందగలడు. వ్యాపారముచేసిన ధనలాభము గలుగును యుద్యోగమున యున్నయెడల సుఖజీవనముగా స్థిరమై జీవించవచ్చును మంచి ఫలములు గలదు.

28 లక్ష్మీవారము నాలవఝామము
నైరుతీమూలారూఢము

దాయాదులచేత తగులుబడి న్యాయాధిపతివద్ద వ్యాజ్యములు బెట్టిరి అందులో నీచేతిరొక్కము చాలా నష్టమాయెను. నీబంధువులున్న విడనాడియున్నారు. గురువు అష్టమందున యుండుటచే యీలాటి కష్టములు గలిగెను. తొంబైయైదుదినములు గడచినపిదప సుఖముగలుగును.

29 లక్ష్మీవారము నాలవఝామము
పశ్చిమదిక్కారూఢము

వొకకన్యను జూచియున్నావు ఆ కన్యను నీవు పెండ్లాడవలెనని చాలా తలపుగొనియున్నావు. ఆ పడుచు గావలసినవారలు పొరుగువారలు గలసి నీకియ్యరాదని ఆక్షేపించుచున్నారు. ఆకన్య నీకు వొనగూడదు. యిది నిజము దాని ఆశ విడిచిపెట్టుము.

30 లక్ష్మీవారము నాల్గవఝామము
వాయువ్యమూలారూఢము

నీతోడబుట్టినవాడైన యన్నతో కలహించుకొని మిక్కిలి మనోచింతగలవాడై దేశాటనము సేయనెంచి వచ్చితివి ఆప్రయాణమునకు సమయము వెదకుచున్నావు మంచిదినముచూచి ప్రయాణము గావించితి వేని నీకు లాభమున్ను శరీరారోగ్యమున్ను మనస్సంతుష్టియు గలుగును.

31 లక్ష్మీవారము నాల్గవఝామము
ఉత్తరదిక్కారూఢము

నీవు యడిగెడి యారూఢము జీవించునట్టి ఫలము అందుకై మువ్వురుగాగూడి వొకవ్యాపారము సేయదలంచియున్నారు. గురువు గోచారఫలమునకు ప్రత్యక్షవైరిగాయున్నాడు గాన యెనిమిదినెలలు గడచినపిదప గురువు మంచివాడై సుఖ నీక్షిణ్యమున చూడగలడు. అవుడు వ్యాపారమునకు ప్రయత్న పడుటచే లాభముగలదు.

లక్ష్మీవారము నాలవఝామము
ఈశాన్యమూలారూఢము

నీ భార్యవలన యింటిలో వొకకలహముబుట్టియున్నది. యా కలహమున నీవు దగులుబడి మనసుచెడి శృశించుచున్నావు. నీవు బుద్ధిమంతుడవై నీభార్యను వశపరచుకొనినయెడల యాకలహము నిన్నంటక పోవును. సుఖముగా యుందువు.

లక్ష్మీవార ఆరూఢఫలము
ము గి సె ను.

---

1 శుక్రవారము తొలిఝామము
తూర్పుదిక్కారూఢము.

కొంతలేని సంపదచే యుజ్జీవింపగలవు నీవు దలచిన కార్యములన్నియు నీయరచేతిలోనుండినట్టే యగును. వొకప్రభువొకడు నీ

నములు పొందుదురు. సాధుపులచే ఆశీర్వాదములందుదురు. దీర్ఘకాల ముగాయున్న జాడ్యము వదలిపోవును. భయమనునది లేదు. భోగముగ లదు. ఘనతయు గలుగును గౌరవము పొందుదురు.

## నిద్రభోవు-ఫలము.

పూర్వపక్షమున పక్షులు-నిద్రసమయముగా యుంటే రోగము దీరదు. యిల్లువిడశి ప్రయాణమై యితరదేశములకు వెళ్లినవారలు మరలిరాజాలరు. తాము బ్రవేశించే కార్యములన్నియు చెడుగులై వచ్చును. పతిచెంత కూడిన పడతులు బ్రతుకు తగ్గిపోవును. చెడుగులే వాటిల్లును. వానలు గురియదు. వరిపంటలు వృద్ధిగానేరదు. వివాహ ములు ముగియదు. నీట్లను బాగుగా గుర్తెరిగి ఆలోచించి చెప్ప వలెను.

## మరణముయొక్క ఫలము.

పూర్వపక్షమున పక్షులకు మరణసమయముగా యుండెనేని మరణము గలుగును. తీరని వ్యాధివచ్చి చేరును. తాముతలచినవస్తు వులు తమవశము గానేరదు. ఐశ్వర్యము తొలగును స్థానభ్రష్టత గలుగును. మిక్కిలి రోగము గలుగును, భార్యకోపించిన విరోధ ముచే మరల గూడదు. యీవిషయములు బాగుగా గుర్తెరిగి చెప్ప వలెను.

## అమరపక్షముయొక్క వివరము.

## పక్షులయొక్క ఫలము, (ఆహారఫలము)

ఆమరపక్షమున పక్షులకు ఆహారము వెక్కువయయ్యేనేని వెంటనే చెడుగును చూపజాలదు. చుట్టములకు మేలున్న లాభకర మున్ను. వ్యాధినివారణయు గలుగును కొంచమైనను చింతరాజాలదు. మంచివానలు గురియును. తమగృహమున శుభకార్యములు ముగి యును ప్రయాణములు లేవు.

## యాత్ర ఫలము.

అమరపక్షమున పక్షులకు నడత సమయముగా యుండెనేని జయముగలదు. శత్రుభయము లేదు. యిండ్లు మొదలగునవి వృద్ధి

యగును. చెడుగువాటిల్లును. వానలుగురియును. దూరదేశ వెళ్ళినవాఁడు వచ్చి చేరుదురు. అని యెరుగవలెను.

### రాజ్యభోగఫలము

అమరపక్షమున పక్షులకు రాజ్యభోగసమయములైతే జయము సుఖములున్ను గలుగును. పోయెడి స్థలములయందు స్వల్పవర్షము గురియును. లోకమున కలహములులేవు. జయము పొందవచ్చును. తన యిల్లువృద్ధియగును. భీతియులేదు.

### నిద్రఫలము

అమరపక్షమున పక్షులకు నిద్రసమయముగాయుంటే శరీరమునగల జాడ్యము మునుపటికంటే యెక్కువయగును. కాల వానలుగురియదు అన్నికార్యములయందు చెడుగులే వాటిల్లును. మనసున క్లేశములే పుట్టించును. ప్రయత్నించుకార్యములకు విరోధములే యేర్పడును.

### మోక్షఫలము

అమరపక్షమున పక్షులకు మరణసమయముగా నుండెనేని అమితభీతియు గొప్పకలహము దుష్టకర్మములే పైపైకి వచ్చుచుండును. యేకార్యములయందు ప్రవేశించినను అనుకూలమునకు రానేరదు. చెడుపువాటిల్లును.

### సూక్ష్మపక్షుల కాలనిర్ణయ వివరము.

సూక్ష్మపక్షులు:— ౧ ఘడియ ఆహారమనియు,

౧ ఘడియ మరణమనియు,

౧½ఘడియ నడతయు,

౧½ఘడియ నిద్రయు,

౧ ఘడియ రాజ్యభోగమనియు దెలియవలయు

## ఆయుచ్ఛావ ఫలము.

పక్షులకు ఆహారసమయముగా నుండెనేని పెద్దవాడనియు నడత సమయమున పిన్నవాడనియు రాజ్యసమయమయ్యేనేని పొడువుగలవాడనియు నిద్రసమయమయ్యేనేని పొట్టివాడనియు మరణకాలమయ్యేనేని సమతయస్సగలవాడని గుర్తించి చెప్పవలెను.

## తపః ఫలము.

పక్షులకు ఆహారమయితే బాలుడనియు నడతయైతే వయసువాడనియు రాజ్యభోగమున లోకపాలకుడనియు నిద్రసమయమైతే ముదుసలివాడనియు మరణసమయముగాయుంటే మౌనముద్రయనియు యీరీతి తెలిసి బలుకునట్టిపలుకులు గొప్పతనమని దెలియవలెను.

## అంగపరిమితి ఫలము

ఆహారమైతే పొడుగాటివాడనియు నడతగాయుంటే పొట్టివాడనియు రాజ్యభోగమున దుష్టశరీరముగలవాడనియు నిద్రయందు బలముగలవాడనియు మరణమైతే యుద్ధమున నిలిచిన యిద్దరిలో బలముగలవాడే అనగా నిద్రసమయముగలవాడు జయప్రదుడగును.

## బలాబలముయొక్క ఫలము.

పక్షులయొక్క ఆహార సమయమునకంటె నడతయెక్కువయగును. నడతకంటే రాజ్యభోగము యెక్కువయగును. నిద్రమంచిన గలుగజేయదు. మరణము చాలా చెడ్డదని దెలిసి బలుకవచ్చును.

## జయము యొక్క ఫలము.

పక్షులు ఆహారమున యుండే యాతడు నడతగలపక్షి లేరున భరిగే వాని జయించగలడు. నడతగలవాడు, రాజ్యభోగపక్షి ఫలము గలవాని జయించును రాజ్యభోగ్యము మరనయిన్నవాడు. నిద్రఫలము గలవాని జయించగలడు. నిద్రఫలముగలవాడు మరణఫలము గలవాని జయించగలడు.

ఇద్దరిలో జయము పొందువారెవరు.

పక్షి ఆహారమునయుంటె ముదుసలి యతడు జయము పొందును.
నడతగాయుంటె బాల్యముగలవాడు జయము పొందును.
నిద్రయైతే చిన్నవాడు జయము పొందును.
రాజ్యభోగమైతే బలహీనుడు జయము పొందును.
మరణమైతే యిద్దరు తోర్పుగెలుపులేక యుందురు.

పర్వనిదాన ఫలము.

ఇద్దరికిని గలిగి పేరువొక్కటైయుండె నేని ఆపక్షి ఆహారసమయముగానుంటే యిందరిలో ముదుసలివాడే జయము పొందును.

పక్షినడతగాయుంటే పోడవైయున్నవాడు జయము పొందును.
పక్షి రాజ్యాభోగమునయుంటే బలహీనుడు జయముపొందును.
పక్షి నిద్రయందుంటే పొట్టివాడు జయము పొందును.
పక్షి మరణములైతే సమబయులో గొప్పవాడెవడో వాడే జయమొందును.

ఒకడు మరియొకని
పారదోలునట్టి ఫలము.

పక్షి ఆహారమునయుంటే ఆపేరుగలవాడు నడతగలపక్షిపేరుగలవానిని జయించగలడు. వీరిరువురు నిద్రయందున్న పక్షిపేరుగలవానికి భయమొందుదురు. నిద్రయందున్న పక్షిపేరుగలవానిని భయపడవలదని అందరున్ను బలుకగలరు.

పక్షులను గుర్తెరిగి
వస్తువులయొక్క పేరులను దెలుసుకొను విధము.

అమరపక్షమున గుడ్లగూబ యెఱ్రని ఛాయగలదియగును.

కాకి ... బంగారు ఛాయగలది,
నెమలి ... ఆకుపచ్చరంగగును.
కోడి ... తెల్లనిరంగు
డేగ ... నల్లఛాయమని గుర్తెరుగవలెను.

కులమలనెరిగే విధము.

పూర్వపక్షమున డేగ ... బ్రాహ్మణుడనియు
గుడ్లగూబ ... వైశ్యజాతియనియు
కాకి ... క్షత్రియుడనియు
కోడి ... శూద్రజాతియు
నెమలి ... ఛండాల జాతియనియు యెరుంగదగినది

అమరపక్షిజాతి క్రమము.

అమరపక్షమున డేగ ... బ్రాహ్మణుడనియు
గుడ్లగూబ ... క్షత్రియుడు
కాకి ... వైశ్యుడు
కోడి ... శూద్రుడు
నెమలి ... అల్పజాతియని దెలియవలెను.

పక్షములు రెంటికిన్ని
ధాతుమూలము జీవితము.

వీట్లనుయెరుగుటకు పక్షుల వివరము

డేగ మూలమనియు
గుడ్లగూబ జీవితమనియు
కాకి ధాతువనియు
కోడి మూలము జీవనమనియు
నెమలి దాతుమూలమనియు దెలియవలెను.

పంచభూతములను

దెలిసికొనదగిన పక్షులు.

పూర్వపక్షమున డేగ ... తేయువు
గుడ్లగూబ ... వాయువు
కాకి ... పృథ్వి
కోడి ... అప్పు
నెమలి ... ఆకాశము

అమరపక్షమున డేగ ... పృథ్వి
గుడ్లగూబ ... అప్పు
కాకి ... తేయువు
కోడి ... ఆకాశము
నెమలి ... వాయువు

విరోధముల గుర్తెఱుగునట్టి

పక్షుల వివరము

ప్రశ్నలిచ్చువారల విరోధులును దెలుపుటకు ప్రశ్నయిచ్చిన యాతని పక్షిని యెదటివానిపక్షిన్ని గుర్తెరిగి దెలుపవలయును.

నెమలికి విరోధ డేగ
గుడ్లగూబకు ,, కోడి
డేగకు ,, గుడ్లగూబయు
గుడ్లగూబకు ,, డేగయు

స్నేహముగల

పక్షుల వివరము

నెమలికి స్నేహము డేగ

కాకికి ,, కోడి

డేగకు ,, కాకియు

కోడికి ,, నెమలియు

త్రికాలము లెరుగునట్టి

పక్షులు

గుడ్లగూబయు నెమలియు భవిష్యత్కాలము

కోడి వర్తమానకాలము

డేగయు కాకియు భూతకాలమని యెరుగవలెను.












పక్షులయొక్క ఫలము చెప్పునపుడు వస్తువులకు ప్రయోగించగా వస్తువుల రుతుల గుర్తెరుగుట.

గుడ్లగూబ...తియ్యని పదార్థము

కోడి...కొంచముపులుసు

కాకి...వగరగును

డేగ...కారమగును

నెమలి...చేదు అని యెరుగవలెను.

పక్షుల వాసములు

డేగకు...యిసుకయెడారి

గుడ్లగూబ...చిన్నచెట్లుండు అడవి

కాకి...పాడుపడినభూమి

కోడి...అడవి

నెమలి...పంటభూమి

పంచలోహములు దెలియుటకు

పక్షులవివరము

డేగ...బంగారము

గుడ్లగూబ...వెండి

కాకి...తామ్రము

కోడి...సత్తు.

నెమలి...యినుము

ప్రశ్నలడిగినవారలకు కాలనిర్ణయమును ప్రత్యుత్తర మిచ్చుట.
డేగ పక్షియారూఢమునవచ్చితే వచ్చుచున్నాడనియు
కోడియైతే వచ్చినాడనియు
నెమలియైతే అర్ధఘడియలో వచ్చుననియు యెరుగునది.

చోర పక్షి ఫలము

డేగయైతే వొకనిచేత తగిలినాడనియు
గుడ్లగూబయైతే వొకయింతి అపహరించినదనియు
కాకియైతే వొంటరివాడే అపహరించినాడనియు
కోడియయితే పురుషుడనియు
నెమలియయితే ఆడదనియు గుర్తెరుగవలెను.

స్త్రీయనియు పురుషుడనియు

యెరుగునట్టి విధము

డేగ కాకి నెమలి యివి పురుషులనియు
గుడ్లగూబ కోడి యివిరెండున్ను స్త్రీలనియు దెలియవలయు

పూర్వపక్షమున

దిక్కులదెలిసికొనతగు పక్షుల వివరము

తూర్పు దిక్కు డేగ
దక్షిణమున గుడ్లగూబ
పడమట కాకి
ఉత్తరము కోడి
మధ్యస్థానము నెమలి యనిదెలియవలెను.

అమరపక్షమున

దిక్కులదెలిసి కొనతగు పక్షులవివరము.

పడమరదిక్కున నెమలి
వుత్తరము గుడ్లగూబ
తూర్పు డేగ
దక్షిణము కాకి
మధ్యస్థానము కోడి యనిదెలియవలయు

పౌర్ణమి తిథియందుండు

పక్షులు

మధ్యస్థానము డేగ
దక్షిణము గుడ్లగూబ

| | |
|---|---|
| తూర్పు | కాకి |
| ఉత్తరము | కోడి |
| పడమర | నెమలి యనవలెను. |

### అమృతస్థానములు.

పూర్వపక్షము అమరపక్షములయందు అమృతకళలు యెక్కుటయు దిగుటయు మొదలగు గుణముల నెరుగునట్టి తిథులు పాదాది కేశపర్యంతము లెరుగు విధముల వివరము.

పూర్వ పక్ష అమరపక్షములకును అమృతస్థానము లొకటే.

#### ప్రధమ తిథి.

| | |
|---|---|
| డేగకు | అరకాలు |
| గుడ్లగూబకు | కాలిమణికట్టు |
| కాకికి | మోకాలు |
| కోడికి | తొడలయందు |
| నెమలికి | శిరమందుండును |

#### విదియ లేక ద్వితీయ తిథి.

| | |
|---|---|
| డేగకు | రెక్కలు |
| గుడ్లగూబకు | పిక్కలు |
| కాకికి | మోకాళ్లు |
| కోడికి | తొడలు |
| నెమలి | అపానస్థానమందుండును, |

#### తదియ లేక తృతీయ తిథి.

| | |
|---|---|
| డేగకు | పాదచీలయందు |
| గుడ్లగూబకు | పిక్కలు |
| కాకి | మోకాలు |
| కోడి | తొడలు |
| నెమలి | కాలివెనుకభాగమందుండును. |

### చవితి చతుర్థి తిథి.

| | |
|---|---|
| డేగకు | నడుము |
| గుడ్లగూబకు | వీపు |
| కాకి | వీపుపైభాగము |
| కోడి | కుత్తుక |
| నెమలి | చేతులు: |

### పంచమి తిథి.

| | |
|---|---|
| డేగ | నాభి |
| గుడ్లగూబ | కడుపు |
| కాకి | రొమ్ము |
| కోడి | స్తన్యము |
| నెమలి | చేతులు |

### షష్ఠి తిథి

| | |
|---|---|
| డేగ | పొ_త్తికడుపు |
| గుడ్లగూబ | కడుపు |
| కాకి | రొమ్ము |
| నెమలి | యెడమభాగము |

### స_ప్తమి తిథి

| | |
|---|---|
| డేగ | వీపుక్రింది భాగము |
| గుడ్లగూబ | వీపుపై భాగము |
| కాకి | గొంతు |
| కోడి | నె_త్తి |
| నెమలి | పార్శ్వము |

### అష్టమి తిథి

| | |
|---|---|
| డేగ | కడుపు |
| గుడ్లగూబ | రొమ్ము |

| | |
|---|---|
| కాకి | వీపు |
| కోడి | యెడమపార్శ్వము |
| నెమలి | కుడిపార్శ్వము |

నవమి తిథి

| | |
|---|---|
| డేగ | రొమ్ము |
| గుడ్లగూబ | రెండుభుజములు |
| కాకి | శరీరమున ముందుభాగము |
| కోడి | శరీరమున వెనుకటిభాగము |
| నెమలి | కాలు |

దశమి తిథి

| | |
|---|---|
| డేగ | రెండుచేతులు |
| గుడ్లగూబ | శరీరముయొక్క పైభాగము |
| కాకి | శరీరముయొక్క ముందుభాగము |
| కోడి | శరీరముయొక్క వెనుకభాగము |
| నెమలి | రెండుతొడలు |

ఏకాదశి తిథి

| | |
|---|---|
| డేగ | అరచేయి |
| గుడ్లగూబ | మీాచెయ్యి |
| కాకి | మోకాలు |
| కోడి | పిక్కలు |
| నెమలి | భుజములు |

ద్వాదశి తిథి

| | |
|---|---|
| డేగ | వ్రేళ్ళకీళ్లు |
| గుడ్లగూబ | వ్రేళ్ళంతయు |
| కాకి | నడివ్రేళ్ళకును |

| | |
|---|---|
| కోడి | అనామిక వేలనియు |
| నెమలి | చిటికెన వ్రేలగున్న. |

త్రయోదశి తిధి

| | |
|---|---|
| డేగ | గొంతు |
| గుడ్లగూబ | నోరు |
| కాకి | రెండు నేత్రములు |
| కోడి | నొసలు |
| నెమలి | వెంట్రుకలు. |

చతుర్దశి తిధి.

| | |
|---|---|
| డేగ | శిరసు |
| గుడ్లగూబ | వీపు |
| కాకి | రెండుచేతులు |
| కోడి | నాభి |
| నెమలి | రెండుకాళ్లు. |

పౌర్ణమి.

| | |
|---|---|
| డేగ | కుత్తుక |
| గుడ్లగూబ | నోరు |
| కాకి | కండ్లున్ను ముక్కు |
| కోడి | చెవులు |
| నెమలి | వెంట్రుకలు |
| కోడికి | నాలుగుతిధులున్ను |
| డేగకు | ఐదుతిధులున్ను |
| కాకికి | రెండుతిధులున్ను |
| గుడ్లగూబకు | మూడుతిధులున్ను |
| నెమలికి | వొక్కతిధియునిపంచవలెను. |

నక్షత్రఫలముల.

గుర్తెరుగు పక్షులు.

డేగకు అశ్విని, భరణి. కృత్తిక, రోహిణి, మృగశిర,
గుడ్లగూబకు ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ,
కాకికి ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ,
కోడికి అనూరాధ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, అభిజిత్తు,
శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర,
నెమలికి రేవతి.

ఆహారము చెప్పుటకు గణిత పక్షుల వివరము.

డేగకు తొలుత చెప్పిన అశ్విని మొదలు మృగశిర నక్షత్రము వరకు ఆహారమనియు
గుడ్లగూబకు ఆరుద్ర మొదలు పుబ్బ నక్షత్రమువరకు ఆహారమనియు
కాకి ఉత్తర మొదలు విశాఖనక్షత్రమువరకు ఆహారమనియు
కోడి అనూరాధ మొదలు అభిజిత్తు నక్షత్రము వరకు ఆహారమనియు
నెమలి శ్రవణము మొదలు రేవతి వరకు ఆహారమనియు ఎరుగవలెను.

పూర్వపక్షమున

పండ్రెండు రాసులయందుండు పక్షుల వివరము.

మేషం సింహం వృశ్చికం యీ మూడురాసులు డేగకున్ను
ధనుసు మీనం యీ రెండురాసులు కాకికిన్ని
తులా ఋషభం యీ రెండురాసులు కోడియు
కటకం కన్య మిధునం యీ మూడురాసులు గుడ్లగూబయు
మకరం కుంభం యీ రెండు రాసులు నెమలికియని యెరుగవలెను.

## అమరపక్షిమున

### సంక్రాంతి యందుండు పక్షులు

కటకం మేషం వృశ్చికం యీమూడురాసులు నెమలికి
కన్య సింహం యీరెండురాసులు కోడికి
మిధునం మకరం కుంభం ధనుసు యీరాసులు కాకి
మీనం తులా యీరెండురాసులు గుడ్లగూబ
మేషం యీరాసి డేగకనియు మెరుగవలెను.

### పక్షులయొక్క కాలగణిత క్రమము.

పక్షులయొక్క కాలము 6ఘడియలుగా విభజించినభాగములలో
డేగ తొలుత ౧½ ఘడియ నిద్రయనియు
రెండవది ౧½ ఘడియ భోజనము
మూడవది ౧½ ఘడియ నడతయనియు
నాల్గవది ½ ఘడియ మరణమనియు
ఐదవది ౧ ఘడియ రాజ్యభోగమని భాగించి చెప్పవలెను.
గుడ్లగూబ తొలుత ౧½ ఘడియ నడతయు
రెండవది ౧½ ఘడియ ఆహారము
మూడవది ౨ ఘడియలు నిద్రయు
నాల్గవది ½ ఘడియ మరణము
ఐదవది ½ ఘడియ రాజ్యభోగమని భాగించవలెను.
కాకి తొలుత ౧½ ఘడియ మరణము
రెండవ ౨ ఘడియ నడతయు
మూడవ ౧ ఘడియ రాజ్యభోగము
నాల్గవ ౧ ఘడియ ఆహారము
ఐదవ ½ ఘడియ నిద్రయనియు యూహించి చెప్పవలెను.
కోడి తొలుత ౧½ ఘడియ నడత
రెండవ ౧½ ఘడియ ఆహారము

మూడవ ౧ ఘడియ రాజ్యభోగము
నాల్గవ ౧ ఘడియ మరణము
ఐదవ ౧ ఘడియ నిద్రయనియు యూహించవలెను.

నెమలి తొలుత ౨½ ఘడియ నడత

రెండవ ౧ ఘడియ ఆహారము
మూడవ ౧ ఘడియ రాజ్యభోగము
నాల్గవ ౧ ఘడియ నిద్రయు
ఐదవ ౧ ఘడియ మరణమని యూహించవలెను.

పైజెప్పిన పక్షులకు రాత్రి పగళ్లయందు ఝామములుగా దెలిపిన వాట్లకు ఝామము వొక్కటికి ఘడియలు ఆరుగాపంచి చెప్పినందుచే యీ ఐదు పక్షులువొక్కటే సమయమున ఆరుఘడియలలో ఆహారములందియు మరణములపొందియు యుండునని దలచవలదు వొక్కొక్కదినమందు వొక్కొక్కపక్షియేఆహారమెుదలగు కార్యములయం దుండునని చక్కగా దెలుసుకొనవలెను. యీ మర్మము చక్కగా తలంపువుంచి పరిశీలించి జ్ఞాపకమునకు దెచ్చుకొని పక్షులను విమర్శగాచూచి సమయము మొదలగు చర్యలు ఆలోచించి చెప్పవలెను మోసబోరాదు.

స్నేహముగల పక్షుల వివరము.

నెమలికి—మైత్రి కోడి కాకి
కాకికి—నెమలి కోడి డేగ
డేగకు—కాకియు
కోడికి—నెమలి కాకియు

గుడ్లగూబకు—కోడి నెమలి డేగ స్నేహమగును యీచెప్పిన స్నేహములు ఆత్మస్నేహమని గుర్తెరుగవలయు.

## విరోధముగల పక్షుల వివరము.

నెమలికి—కోడికి డేగ విరోధి
కాకికి—గుడ్లగూబ విరోధి
గుడ్లగూబకు—కాకి విరోధి

డేగకు—నెమలి గుడ్లగూబకోడి విరోధములుయీచెప్పిన విరోధములు ఆత్మవిరోధములని దెలియవలయు.

## రాసులయొక్క గురుతు.

మకరం కన్య మిధునము యివి నలుపుచాయగలది
వృశ్చికము కుంభము మీనము పసుపురంగు
ఋషభం తులా కటకం యివి తెల్లనిచాయగలది
మేషం ధనుసు సింహము యివి యెరుపుచాయగలది

## రాశిగ్రహములరంగులు.

శనివారము మకరం మిధునం కన్య యివి నలుపుచాయ
బుధవారము మీనం కుంభము వృశ్చికము యివి పచ్చరంగు
సోమ ఆది శుక్రవారము ఋషభము తులా కటకము యివి స్వేతవర్ణము
మంగళవారము మేషం ధనుసు సింహము యివి యెర్రనిరంగు
గురువారము బంగారు చాయ యని చెప్పబడును

## గ్రహములకుమైత్రిరాసులు.

సింహరాశి—సూర్యునకుమైత్రి
ఋషభము—చంద్రునికిస్నేహము
మేషము—అంగారకునిమిత్రుము
కన్యారాశి—బుధగ్రహమునకుసంబంధము
దనురాశి—బృహస్పతికిస్నేహము

తులారాశి శుక్రునకుఅయిక్యము

కుంభరాశి శనిగ్రహమునకుమిత్రము యివి మూల త్రికోణము లనబడును.

గ్రహములనగా యెవి

సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు శని, రాహు, కేతు యీతొమ్మిదిన్ని నవగ్రహములనబడును.

గ్రహములలో శత్రుగ్రహముల వివరము.

సూర్యునకు విరోధము శుక్రుడు శని రాహు కేతువులు

చంద్రునకు పగ రాహు కేతువులు

అంగారకునకు శత్రు బుధుడు రాహు కేతువులు

బుధగ్రహమునకు వైరి శని గ్రహము

గురువునకు విరోధులు శుక్రుడు బుధుడున్ను

శుక్రునికి విరోధి సూర్యుడు చంద్రుడును

శని రాహు కేతువులకు విరోధులు సూర్యుడు చంద్రుడు అంగారకుడు వీరని దెలియవలెను.

నవగ్రహములలోమిత్రగ్రహములు

సూర్యునికి మైత్రి గ్రహములు అంగారకుడు చంద్రుడు గురువు మొదలగువారలు

చంద్రునికి మైత్రి గ్రహములు సూర్యుడు బుధుడును

అంగారకునకు మిత్రగ్రహములు సూర్యుడు చంద్రుడు గురువు లగుదురు

బుధగ్రహమునకు స్నేహములు శుక్రుడు సూర్యుడును

బృహస్పతికి స్నేహములు సూర్యుడు చంద్రుడు అంగారకుడును

శుక్రగ్రహమునకు బుధుడు రాహు కేతువులు

శనిగ్రహమునకు శుక్రుడు బుధుడు రాహు కేతువులు

రాహు కేతువులకు మిత్రము శనియు శుక్రుడును

యివి నవగ్రహములలో వొకటికొకటికి గల మిత్రములని దెలియవలెను.

## నవగ్రహములసమత్వము.

సూర్యునకు సమము బుధగ్రహము

చంద్రునకు సమము అంగారకుడు శుక్రుడు గురు శనియగును

అంగారకునకు సమము శుక్రుడు శనియు

బుధగ్రహమునకుసమము అంగారకుడు శని బృహస్పతి రాహు కేతువులు

బృహస్పతికి సమము శని రాహు కేతువులు

శుక్రునకు సమము అంగారకుడు బృహస్పతియు

శని గ్రహము సమము బృహస్పతియగును

రాహు కేతువులకు సమము బుధుడున్ను బృహస్పతియగుదురు.

యీలాగు యుండినయెడల గ్రహముల బలాబలములున్ను ఫలాఫలములున్ను సమముగా యెంచి ప్రశ్నలకు ప్రత్యుత్తరము బలుకవలయును.

## నవగ్రహములకు గల చాయలు.

శనిగ్రహమున్ను రాహువున్ను నల్లనిచాయగలవారలు

బుధుడు పసుపురంగుగలవాడు

బృహస్పతి బంగారుచాయగలవాడు

శుక్రుడు చంద్రుడున్ను స్వేతవర్ణముగలవారు

అంగారకుడు సూర్యుడు కేతు యెర్రనిచాయగలవారు యీలాగున చాయల గుర్తెరుగవలయును,

గ్రహమునకు మఱియొక గ్రహమువలన గలుగునట్టి బలిమిని మెరుగదగునట్టి వివరము.

నవగ్రహము లొక్కొక్కటికి మరియొక గ్రహముచే గలుగునట్టిబలిమి.

| | | |
|---|---|---|
| బుధగ్రహమునకు | బలమునిచ్చువాడు | అంగారకుడు |
| అంగారకునకు | ,, | శనిగ్రహము |
| శనైశ్వరునకు | ,, | బృహస్పతి |
| బృహస్పతికి | ,, | శుక్రుడు |
| శుక్రునకు | ,, | చంద్రుడు |
| చంద్రునికి | ,, | సూర్యుడు |
| సూర్యునకు | ,, | రాహు కేతువులు |

నక్షత్రముల విరోధములు.

| | | |
|---|---|---|
| భరణినక్షత్రములకు | విరోధము | జ్యేష్ట |
| కృత్తికనక్షత్రమునకు | ,, | అనూరాధ |
| రోహిణీనక్షత్రమునకు | ,, | విశాఖనక్షత్రము |
| మృగశీర్షకు | ,, | స్వాతి |
| ఆరుద్రకు | ,, | ధనిష్ట |
| పూర్వాషాడకు | ,, | శతభిషము |
| ఉత్తరాషాడకు | ,, | ఉత్తరాభాద్రయు |
| అనూరాధకు | ,, | పూర్వాభాద్రయు |
| ఉత్తరానక్షత్రమునకు | ,, | ఉత్తరాషాఢయు |
| హస్తానక్షత్రమునకు | ,, | పూర్వాషాఢయు |
| చిత్తానక్షత్రమునకు | ,, | ఆశ్లేషయు |
| రేవతినక్షత్రమునకు | ,, | పుబ్బానక్షత్రము |

యీ నక్షత్రములు వొకటి కొకటి విరోధములు గావున యీ నక్షత్రములు తప్ప యితర నక్షత్రములు వొండొకటి స్నేహములని యెరుగవలెను.

విరోధజంతువులు.

| | | |
|---|---|---|
| యేనుగకు | విరోధములు | సింహము |
| ఆవునకు | ,, | పులి |
| గుఱ్ఱమునకు | ,, | మహిషము |
| గొఱ్ఱెకు | ,, | కుక్క |
| పామునకు | ,, | కోతి |
| యెలుకకు | ,, | పిల్లి |
| జింకకు | ,, | కుక్క |

స్త్రీపురుష వృక్షములు.

కాఠిన్యముగాయుండు వృక్షములు పురుషవృక్షములని యెరుగవలెను. పాలుగలిగినవృక్షములు ఆడవృక్షములని దెలియవలెను.

మఱ్ఱివృక్షము రాగివృక్షము, మేడి, దానిమ్మ, పొగడ, పనస, మామిడి, యిప్పవృక్షము, చంపకము, జిల్లేడు, పాలవృక్షము, నేరేడు, యీ పంౘడెండున్ను పాలుండువృక్షములు గాన ఆడవృక్షము లనియు తక్కినవి మొగవృక్షములనియు చెప్పబడును.

రాసులకు రాసులు వశమగువిధములు.

| | | |
|---|---|---|
| మేషరాశికి | వశమగునది | సింహరాశి |
| ఋషభరాశికి | ,, | తులారాశియు కటకం |
| మిధునరాశికి | ,, | కన్యారాశియు |
| కటకమునకు | ,, | ధనుస్సు, వృశ్చికము |
| సింహరాశికి | ,, | తులారాశి |

| | | |
|---|---|---|
| కన్యారాశికి | ,, | మిధునం మీనం |
| తులారాశికి | ,, | మకరం |
| వృశ్చికమునకు | ,, | కటకం కన్య |
| ధనుస్సునకు | ,, | మీనము |
| మకరరాశికి | ,, | మేషము కుంభము |
| కుంభరాశికి | ,, | మేషము |
| మీనరాశికి | ,, | మకరము |

యీ వివరములు విరోధములని దెలియవలెను.

రాసులయొక్క దిశలు.

| | | |
|---|---|---|
| మేషము ఋషభము | యివి | తూర్పుదిక్కగును |
| కటకము సింహము | ,, | దక్షిణదిక్కగును |
| తులా వృశ్చికము | ,, | పడమటిదిక్కగును |
| మకరం కుంభం | ,, | ఉత్తరదిక్కగును |
| మిధునము | ,, | ఆగ్నేయమూల |
| కన్య | ,, | నైరుతిమూల |
| ధనుస్సు | ,, | వాయువుమూల |
| మీనము | ,, | ఈశాన్యము |

రాసులయందుండు త్రివిధచారములు.

చంద్రుడు అంగారకుడు రాహు కేతువులకును చారిగ్రహములు

సూర్యుడు శుక్రుడు స్థిరగ్రహములు

బుధుడు బృహస్పతి శని ఉభయగ్రహములు

## రాసులకుగలపార్వ.

మేషము కటకము తులా మకరము యివి చరరాసులు యివి 11 యింటిని చూచును.

వృషభము వృశ్చికము కుంభము సింహము యివి స్థిరరాసులు యివి 9 యింటను చూచును.

ధనుస్సు మిధునము కన్య మీనము యివి ఉభయ రాసులు యివి 7 యింటిని జూచును.

## ఫలములు.

ప్రశ్నలిచ్చినరాసిని గణుతించిచూడగా ఆరూఢమును చెప్పుటకు అలవియగును.

ఆరాశిని తొలిగా లెక్కబెట్టి అది మొదలు లెక్కించగా రాసులక్రమము దెలిసి బలుకవచ్చును.

శుక్రుడున్ను బృహస్పతియు ఆకసమద్యమనియు
బుధుడు చంద్రుడు జలమనియు

సూర్యుడు అంగారకుడు శని భూమియనియు దెలిసి ప్రశ్నలకు ప్రతిబలుకవలెను.

## గ్రహములచూపులు.

తామున్నచోటికి 7-వ భాగమున గ్రహములు చూచినయంత

శనిపార్వ 3 10 యిండ్లయందును
అంగారకపార్వ 4 8 ,,
బృహస్పతిపార్వ 5 9 ,,
రాహు కేతువులు 3 11 ,,

3 10 యిండ్లచూపులు పాతిక చూపనియు
4 8 ,, అర్థపార్వ ,,

5 9 ,, ముక్కాలు ,,
7 ,, నిండుపార్వ ,,

క్రూరగ్రహములు.

సూర్యుడు రాహు కేతువులు అంగారకుడు శని యివి కూర గ్రహములు

బృహస్పతి చంద్రుడు బుధుడు యివి శుభగ్రహము

అపరపక్ష చంద్రుడును శనితోగూడిన బృహస్పతియు పాప గ్రహములు

చోరము జారత్వములను దెలిసికొనదగిన
రాసులవివరము.

మీనము వృశ్చికము కటకము బృహస్పతివారము సోమ వారము లేక బృహస్పతి గ్రహము చంద్రుడు యివి బ్రాహ్మణ వంశ మనియు

సింహము మేషము ధనుస్సు అంగారకుడు సూర్యుడు మంగళ వారము ఆదివారము యివి క్షత్రియవంశమనియు

మిధునము కుంభము బుధుడు బుధవారము యివి వైశ్య జాతి యనియు

ఋషభము కన్య మకరము శుక్రుడు శుక్రవారము యివి శూద్రజాతియనియు

శనిగ్రహము శనివారము యివి పంచమజాతియనియు

రాహు కేతువులు యివి కటిక జాతియనియు దెలియవలెను.

# ప్రకటన

రూ॥లు

| | |
|---|---|
| భట్టి విక్రమాదిత్యుని కథ రఫ్ 2-0-0 గ్లేస్ | 2-8-0 |
| వేమన పద్యములు పెద్ద అక్షరములు ,, 2-0-0 ,, | 2-8-0 |
| సకల సర్వగుణ అదృష్టదీపిక (2. భాగములు చేరినది) | 1-8-0 |
| సకలదేవతా కైవల్యమను మహా మంత్రరహస్యమున్ను | |
| మర్మశాస్త్రము 2 భా. చేరినది నైస్ బయిండు 2-0-0 కాలికో | 2-8-0 |
| పంచపాండవుల అజ్ఞాతవాసము | 1-8-0 |
| అల్లి అర్జున చరిత్రము వచనకావ్యము | 0-10-0 |
| సత్య హరిశ్చంద్ర వచనకావ్యము | 0-12-0 |
| సిద్ధమూలిక యంత్ర మంత్ర రహస్యము | 1-0-0 |
| వ్రణచికిత్స | 0-8-0 |
| దేవతాసిద్ధియగు మళయాల మంత్ర రాజీయము యంత్ర సహితము రెండుభాగములు చేరినది | 1-12-0 |
| వశిష్టప్రోక్త పులిప్పాణి వైద్య రహస్యము | 1-8-0 |
| ధన్వంతరి వైద్య చికిత్సాసారము | 0-12-0 |
| శ్రీరామగురుబోధామృతాసార తత్వవిచారణ | 0-12-0 |
| పతివ్రతా మాహాత్మ్యంబను స్త్రీ భక్తవిజయము | 0-8-0 |
| అనుభవ యూనాని వైద్యామృతము | 0-12-0 |
| కాశీ రామేశ్వర యాత్రా దర్పణము | 0-12-0 |
| శ్రీ భగవద్గీత తాత్పర్య సహితము | 1-4-0 |
| సరస్వతీ కల్యాణ పాటలు | 0-8-0 |
| అనుభవ వైద్య బ్రహ్మ రహస్యములు నాలుగుభాగములు | 2-0-0 |
| ఎనిమిది భాగములు | 4-0-0 |
| నలభీమపాకశాస్త్రము | 1-8-0 |
| వేదాంత కీర్తనలను సుజ్ఞాన రత్నావళి | 0-8-0 |

కె. యల్. వి. విజయలక్ష్మీ, అండు కంపెని.

నెం. 9, చాకల సందు, సౌకారు పేట పోష్టు, మద్రాసు.

# భోగరుషి సూక్ష్మ




క॥ పక్షుల వివరము సూక్ష్మము
లక్షణముబోగమాను లతిసంగ్రహమై
ఈక్షితి నరులకు వితరణ
మీక్షింపగవ్రాసె చోద్య మొందగబ్రీతిన్॥

| అక్షరములు | అ ఆ | ఇ ఈ | ఉ ఊ | ఎ ఏ | ఒ ఓ |
|---|---|---|---|---|---|
| పక్షులు | డేగ | గుడ్లగూబ | కాకి | కోడి | నెమలి |

వివరములు.

అ ఆకారము డేగ ఆహారము ఘడియ ౧ ।
ఇ ఈ గుడ్లగూబకు నడత　,,　౧౪
ఉ ఊ కాకి రాజ్యభోగము　,,　౨
ఎ ఏ కోడి నిద్ర　,,　౩
ఒ ఓ నెమలి మరణము　,,　౪

పక్షములు రెంటికి పక్షులు గావించుకార్యముల వివరము.
పూర్వపక్షముపగలు ఆహారము నడత రాజ్యభోగము నిద్రమరణము
అమరపక్షము రాత్రి ఆహారము రాజ్యభోగము మరణము నడత నిద్ర

| | ఝూామ 1 | ఝూామ 2 | ఝూామ 3 | ఝూామ 4 | ఝూామ 5 | |
|---|---|---|---|---|---|---|
| పూర్వ పక్షము | ఆహార డేగ | నడత గుడ్ల | రాజ్య కాకి | నిద్ర కోడి | మరణం నెమలి | అమరప క్షమున |
| | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | |

వీటికివివరములు.

పూర్వపక్షదినముల పగళ్లయందుగల ఘడియలు 30 ఇందుకు ఝూమములు 5 వంతున పక్షులొనర్చు కార్యములు మెవియనగా

1 జామము ఆహారము, 2 జామము నడతయు, 3 జామము రాజ్యభోగము, 4 జామము నిద్రయు, 5 జామము మరణమునగును.

పూర్వపక్షమున రాత్రి 30 ఘడియలకు జామములు 5 వంతున

1 జామము ఆహారము, 2జామము రాజ్యభోగము, 3జామము మరణము, 4జామము నడతయు, 5జామమునిద్రయనియుదెలియవలెను.

అమరపక్షము పగలు 30 ఘడియలకు జాముములు 5 వంతున పక్షులొనర్చు కార్యములు మెవియనగా

1 జామముఆహారము 2జామముమరణము 3జామమునిద్రయు 4 జామము రాజ్యభోగము 5 జామము నడతయునగును.

అమరపక్షమున రాత్రి 30 ఘడియలకు జామములు 5 వంతున

1 జామము ఆహారము 2 జామము నిద్ర 3 జామము నడత 4 జామము మరణము 5 జామము రాజ్యభోగము

ఈ వివరములు పూర్తిగా కృష్ణ శుక్ల పక్షముల దినములు ఆలకించి దీర్ఘాలోచనతో పొరబాటుపడక యీసూక్ష్మములు దెలిసి బలుకుటచాలామంచిది.

జామములను పంచే విధము.

ప్రొద్దున 6 గంటలుమొదలు సాయంత్రము 6 గంటలు వచ్చే వరకు 30 గడియలు లేక జామములు 5 గా దెలిసి పంచవలెను.

సాయంత్రము 6 గంటలు మొదలు ప్రొద్దున తెల్లవారే వరకు గడియలు 30 యింటికి జామములు 5 గా యుంచవలెను.

కొందరు గడియలవల్ల పొరబాటగుదురు గావున గంటలుగ్ ఖిమ ములుగా పంచి దెలుపుచున్నాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయం 6 మొదలు | 8 వరకు 24 నిమిషములు | | | ప్రొద్దు ఝా | 1 |
| ,, 8 గం. 24 ని. | 10 గం. 48 ని. | | | ,, | 2 |
| ,, 10 ,, 48 ,, | 1 ,, 12 ,, | | | ,, | 3 |
| మధ్యా 1 ,, 12 ,, | 3 ,, 36 ,, | | | ,, | 4 |
| ,, 3 ,, 36 ,, | 6 ,, | | | ,, | 5 |

గడియలవివరము.

| | | | | |
|---|---|---|---|---|
| 1 గడియ మొదలు | 6 గడియలవరకు | జామము | | 1 |
| 6 ,, | 12 | ,, | ,, | 2 |
| 12 ,, | 18 | ,, | ,, | 3 |
| 18 ,, | 24 | ,, | ,, | 4 |
| 24 ,, | 30 | ,, | ,, | 5 |

ప్రశ్న లడగవచ్చి యిచ్చిన వాక్యములగల మొదటి అక్షరములను పక్షులుగాభాగించిన అక్షరములు యెన్నియగుచున్నవో వాటిని వరుసగా గుణించి ఆవ్యవహారముల ననుసరించి వుత్తరముచెప్పవలెను రెండుపక్షములకుగల రాత్రిపగలుదెలిసి వాటి ఫలాఫలములను దెలుపవలెను. వీట్లను శుక్ల కృష్ణపక్షముల రేపగలు దెలిసి బలుకవలెను ఈ పక్షులవివరము ముందుగావ్రాశియుండునది పూర్తిగాచూడవలెను.

పైపద్ధతికి ఉదాహరణము పూర్వపక్షమున శుక్లపక్షమున వొకడువచ్చి ప్రశ్నయిచ్చిన ఆప్రశ్న ఆదివారము పగటిపూటగాయుండి నాల్గవభాగమైతే ఆడిగినప్రశ్నలో మొదటి యక్షరము (ఎ) అను అక్షరమగును దీనిని పక్షి కోడి మూడవ జామము ఆదివారమున నిద్రయుండుదును గాన వాక్యాక్షరములలో జామములగు కాలమునకు అనుసరించి (ఎ) అను అక్షరము యెందున్ననో వాటిని అనుసరించవలెను. ఉదాహరణము (కమలదేవి) యీవాక్యమున నాల్గవ అక్షరమున యేకారమున్నది గాన ఆదివారము మధ్యాహ్నము ౧౨గంటయు లేక ౧౬౹ గడియ యనియు దెలియవలెను.

## పంచపక్షులసూక్ష్మకాలపరిమితి.

క. పావులు మైదగు తిండికి
పావులు ఆరైతె నడత పడకయు మూడున్
పావులు రెండగు మరణము
పావులు అష్టంబు రాజ్య పాలన మొందర్.

## మరియొకవిధము పక్షులకాలములను తెలిసికొనువిధము.

జామము 1 టికి గడియలు 6 గా పంచిన ఆపక్షులకాలము సూక్ష్మకాలమని యెరుగవలెను.

| | | | |
|---|---|---|---|
| 1 జామమును 6 గా పంచి డేగకు | ఆహారము | ౧। | గడియ |
| | నడత | ౧౻ | ,, |
| | రాజ్యభోగము | ౨ | ,, |
| | నిద్ర | ౻ | ,, |
| | మరణము | ౺ | ,, |
| గుడ్లగూబ | నడత | ౧౻ | ,, |
| | రాజ్యభోగము | ౨ | ,, |
| | నిద్ర | ౻ | ,, |
| | మరణం | ౺ | ,, |
| | ఆహారము | ౧। | ,, |
| కాకి | రాజ్యభోగము | ౨ | ,, |
| | నిద్ర | ౻ | ,, |
| | మరణం | ౺ | ,, |
| | ఆహారము | ౧। | ,, |
| | నడత | ౧౻ | ,, |

| | | | |
|---|---|---|---|
| కోడి | నిద్ర | ౻ | ,, |
| | మరణం | ౪ | ,, |
| | ఆహారము | ౧\| | ,, |
| | నడత | ౧౪ | ,, |
| | రాజ్యభోగము | ౨ | ,, |
| నెమలి | మరణము | ౪ | ,, |
| | ఆహారము | ౧\| | ,, |
| | నడత | ౧౪ | ,, |
| | రాజ్యబోగము | ౨ | ,, |
| | నిద్ర | ౻ | ,, |

ఇంకయు వివరించి చెప్పెదము. బాగుగా గుర్తెరుగవలను.

పగలు 30 ఘడియలను ఐదుపక్షులకు పంచిబెట్టగా పక్షివొకటికి ఘడియలు 5 వంతున వెలసెను. యీలాగు పంచిపెట్టుటను స్థూలపక్షుల వివరము.

ఆలాగుపంచిన 6 ఘడియలలోను పక్షులకు పంచిపెట్టగా పక్షి వొకటికి రెండు ఘఢియలు ౧౪ ఘడియ ౧| ఘడియ ౻ ఘడియ ౪ ఘడియగా పంచిన ఘడియల మొత్తము ఆరు అగుచున్నది. యీలాగు పంచిచూచునెడ ఆయా పక్షులు వొనర్చునట్టి కార్యముల మీద ఘడియలకు కాలము మార్పులై వచ్చును.

ఆవివరములు ఆలకించవలెను.

1 జామమును 6 గా పంచిన వాటిలో తొలుత రాజ్యబోగము యిందులో

| | |
|---|---|
| ఆహారము | ౧\| |
| నడత | ౧౪ |
| రాజ్యభోగము | ౨ |
| మరణము | ౪ |

ఈలాగున పంచినచో పక్షులయొక్క ఫలములు క్రమము దెలిసికొని ఆరూఢ మడిగినవారలకు ప్రత్యుత్తరములు దెలుపవచ్చును.

స్థూల పంచపక్షులకు చెప్పియుండు రీతిగా సూక్ష్మ పంచ పక్షులకు పలము దెలుపునెడ రాజ్యభోగమున ఆహారమున్ను రాజ్యభోగమున రాజ్యభోగమున్ను ఉత్తమము తక్కినవి మధ్యమములని యెరుగవలెను.

పూర్వపక్షములు.

సీ. స్థూలపక్షుల విదము సూక్ష్మంబు దెలిపిరి
బక్షుల మరణంబు బలుకు నపుడు
భాను శుక్ర దినము బరగగూబకుచావు
గురు శని వారంబు గూలుడేగ
ఉడు రాజు దినమున యుసురుతో నా కాకి
అంగారకుని దినం బణగు కోడి
బుధవార మైతేను పొందును మరణంబు
నెమలికి తప్పదు నెంచి చూడ,

ఇట్టి వారంబు లరసిన విబుధ జనులు
నరుల కితముగ శాస్త్రంబు లనుసరించి
బలుక నేర్చిరి ప్రియమున వసుధ యందు
పంచ పక్షుల సూక్ష్మంబు బలికినారూ.

పూర్వపక్షమున మరణములొందునట్టి పక్షులు యేవియనగా

| | | | |
|---|---|---|---|
| ఆదివారము శుక్రవారము యీదినములలో | | గుడ్లగూబ | మరణము |
| లక్ష్మివారము శనివారము | ,, | డేగ | ,, |
| సోమవారము | ,, | కాకి | ,, |
| మంగళవారము | ,, | కోడి | ,, |
| బుధవారము | ,, | నెమలి | ,, |

మరణపక్షులవివరచక్రము.

| పక్షములు | ఆది | సో | మం | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|---|
| పూర్వపక్ష | ఇ | ఉ | ఎ | ఒ | అ | ఇ | అ |
| అమరపక్ష | ఉ | ఇ | అ | ఒ | ఎ | ఒ | ఎ |

అమరపక్షముయొక్క వివరము.

సీ. కృష్ణ పక్షంబున కుదురుగా పక్షులు
మరణంబు నొందెడి మహిమ గనుడీ
బుధ శుక్రవారంబు లొందును నెమలియు
మరణంబు లనుమతి నెరుగవలయు
శని గురు వారముల్ చెలగును కోడికి
మరణంబు లేజెల్లు మనుజులార
భానువారము చావు బుట్టును కాకియు
యిందు వారము గుడ్ల గూబ కగును

మంగళ వారంబు డేగయు మరణమొందు
యనుచు రార్యులు వివరంబు లందు జేసి
యట్టి సూక్ష్మంబు దెలిసియు యవనిలోను
బలికి ననుచాల నిజము లే బయలుపడును.

| | | |
|---|---|---|
| సోమవారము | గుడ్లగూబ మరణమనియు | |
| మంగళవారము | డేగ | ,, |
| ఆదివారము | కాకి | ,, |
| శుక్ర బుధ | నెమలి | ,, |
| శని లక్ష్మివారం | కోడి | ,, యెరుగవలెను |

శబ్దాక్షరపక్షులవివరములు.

సీ. అకారమన్నను కాళ్ళు యగును తలయును కరము
వొడలు ముందును వెనుక వొప్పియుందు

ఇకారముందు వెనుక యిదియు కాళ్ళను శిరము
చేతులు యొడలుగా చెప్పవలయు
ఉకారము యొడలు ముందు వెనుకయు కాళ్ళు
శిరము చేతులుగాను వెలగుచుండు
ఏకారమైతేను చేతులు యొడలుగా
ముందు వెనుకను కాళ్ళు మొనయు శిరము
ఓకారమునకొప్పు శిరము కరము
యొడలు తోడుగ నొప్పుచుండు
ముందు వెనుకకు కాళ్ళకు మొనసి జూడ
జామములు దెలివితో జరుపవలెను.

| జామములు | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| అకారము | కాళ్ళు | శిరము | చేతులు | శరీరము ముందు వెనుక |
| ఇకారము | ముందు వెనుక | కాళ్ళు | శిరము | చేతులు వొడలు |
| ఉకారము | వొడలు | ముందు వెనుక | కాళ్ళు | శిరము చేతులు |
| ఏకారము | చేతులు | వొడలు | ముందు వెనుక | కాళ్ళు శిరము |
| ఓకారము | శిరము | చేతులు | వొడలు | ముందు వెనుక కాళ్ళు |

వాక్యాక్షరముల శబ్దములు లేక అక్షరములను
తాకినను పక్షుల గుర్తెరుగువిధము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఇ | ఉ | ఏ | ఓ | అ | డేగ | యనియు |
| ఉ | ఏ | ఓ | అ | ఇ | గుడ్లగూబ | ,, |
| ఏ | ఓ | అ | ఇ | ఉ | కాకి | ,, |
| ఓ | అ | ఇ | ఊ | ఏ | కోడి | ,, |
| అ | ఈ | ఊ | ఏ | ఓ | నెమలి | ,, |

వీట్లలో ఆయాఅక్షరశబ్దములనైనను లేక తాకిచూపిన అక్షరములనైనను గణుతించివాట్లను పక్షులుగాభావించి ఆపక్షులుయొక్క ఝామములయొక్క కార్యములగుర్తెరిగి క్రమముగా ఫలాఫలముల దెలుపుట అత్యావశ్యకము.

ఇందు వొక్కొక్క పక్షియును ఆయావారములయందుగల తొలిజామమును పొందియుండగా తక్కినపక్షులు తక్కిన నాలుగు జాములయందు సంచరించుచుండునని దెలియవలెను.

ఉదాహరణవివరము.

(గురుస్వామి)|అను యీవాక్యమునగల తొలియక్షరము (గు) యిందుకు అధికారియగు కాకి యగును. (గు) అయినను కు అయినను రెండు వొక్కటే పక్షిగా భావించవలెను. యిది అపరపక్షమున బుధవారము పగటిపూట 2 గంటలకు నాలుగోజామమున గావున మూడవ పక్షియగు కాకి యనునది తొలిఝామున ఆహారమున్ను రెండవఝామమున మరణమనియు మూడవ జామమున నిద్రయనియు నాలవ జామమున రాజ్యభోగమనియు అయిదవ జామమున నడతయనియు దెలియవలెను,

ఈలాగుననే తక్కిన నాలుగు పక్షులున్ను వొకటివెంబడి మరియొకటిగా పూర్వాపరపక్షములయందు వాటివాటికార్యములను గుర్తెరుగవలెను ఆపైఫలాఫలములను బలుకవలెను.

ఈ పక్షులు వొనర్చునట్టి కార్యములకు పూర్వపక్షమున ఆహారము రాజ్యభోగము యినిరెండున్ను మంచివియేయగును అపరపక్షమైతే ఆహారము నడత రాజ్యభోగము యివిమూడున్ను మంచివియే యగును. తక్కినవి అశుభ ఫలములని దెలియవలెను.

తానుదలంచియున్న యాతనికైనను మెన్నడెరుగని వొకనిజూడబోవునపుడున్ను, వొకరిపై కవితపాడునపుడుగాని దుర్విషయముల నివర్తిసేయ ప్రయత్నపడునపుడైనను తనపేరిటగల పక్షి రాజ్యభోగమందైనను ఆహారమందైనను యుండవలెను.

తాను చూడపోవునపుడు యెదటివారిపక్షి మరణమందైనను నిద్రయందైనను యుండవలెను. యీలాగు దెలిసి చరించినయంత తనకు శుభములున్ను దలచిన కార్యములు సఫలములగును. యీరహస్యములు దెలియక తబ్బిబ్బులుగా పక్షులనున్ను కాలములున్ను విడచిబెట్టినవారి కార్యసాధనలు గానేరదు. తలపులు యీడేరదు.

| వారములు వాక్యాక్షరములు | పంచ పక్షులు | తొలి ఝాము ౧। ఆహారము | 2 ఝా౧౹ నడత | 3-వ ఝా ౨ రాజ్యం | 4 ఝా ౹౹ నిద్ర | 5-వ ఝా ౹ మరణ |
|---|---|---|---|---|---|---|
| ఆది మంగళ | డేగ గుడ్ల | ఆహారము | నడత | రాజ్యం | నిద్ర | మరణ |
| క కా గ గా | గూబ | నడత | రాజ్య | నిద్ర | మరణం | ఆహార |
| ని నీ పు పూ | కాకి | రాజ్యం | నిద్ర | మరణం | ఆహా | నడత |
| యె యే నొ | కోడి | నిద్ర | మరణం | ఆహార | నడత | రాజ్య |
| నో | నెమలి | మరణము | ఆహా | నడత | రాజ్య | నిద్ర |
| సోమ బుధ | డేగ గుడ్ల | మరణము | ఆహా | నడత | రాజ్య | నిద్ర |
| కొ కో మ | గూబ | ఆహారము | నడత | రాజ్య | నిద్ర | మరణ |
| మా లి లీ | కాకి | నడత | రాజ్య | నిద్ర | మరణం | ఆహార |
| ను నూం | కోడి | రాజ్యం | నిద్ర | మరణం | ఆహా | నడత |
| ఉ ఊ తె తే | నెమలి | నిద్ర | మరణం | ఆహార | నడత | రాజ్య |
| లక్ష్మి వార | డేగ | నిద్ర | మరణం | ఆహార | రాజ్య | రాజ్య |
| కె కే చొ చో | గుడ్ల గూబ | మరణము | ఆహా | నడత | నడత | నిద్ర |
| శు శో త తా | కాకి | ఆహారము | నడత | రాజ్య | నిద్ర | మరణం |
| యు యూ న | కోడి | నడత | రాజ్య | నిద్ర | మరణం | ఆహార |
| నా | నెమలి | రాజ్యం | నిద్ర | మరణం | ఆహా | నడత |
| | డేగ | రాజ్యం | నిద్ర | మరణం | ఆహా | నడత |
| శుక్రవార | గుడ్ల గూబ | నిద్ర | మరణం | ఆహార | నడత | రాజ్యం |
| శె శే చె చే | కాకి | మరణము | ఆహా | నడత | రాజ్య | నిద్ర |
| నొ నో ప పా | కోడి | ఆహారము | నడత | రాజ్య | నిద్ర | మరణం |
| రి రీ | నెమలి | నడత | రాజ్య | నిద్ర | మరణం | ఆహార |
| | డేగ | నడత | రాజ్య | నిద్ర | మరణం | ఆహార |
| శని వారము | గుడ్ల గూబ | రాజ్యము | నిద్ర | మరణం | ఆహా | నడత |
| కె కే గె గే | కాకి | నిద్ర | మరణం | ఆహార | నడత | రాజ్యం |
| కొ కో | కోడి | మరణము | ఆహా | నడత | రాజ్య | నిద్ర |
| ము మూ | నెమలి | ఆహారము | నడత | రాజ్య | నిద్ర | మరణం |

| వారములు వాక్యాక్షరములు | పంచ పక్షులు | తొలి ఝాము ౧। ఆహారము | 2-వ ఝా ౩ రాజ్య | 3-వ ఝా ౪। మరణం | 4-వ ఝా ౧౪। నడత | 5-వ ఝా ౪౪। నిద్ర |
|---|---|---|---|---|---|---|
| ఆది మంగళ | డేగ | మరణము | నడత | నిద్ర | ఆహారం | రాజ్యం |
| కొంకోగాగో | గుడ్లగూబ | రాజ్యము | మరణం | నడత | నిద్ర | ఆహారం |
| తుతతా నో | కాకి | ఆహారము | రాజ్య | మరణం | నడత | నిద్ర |
| నో తి తీ | కోడి | నిద్ర | ఆహార | రాజ్యం | మరనం | నడతా |
| | నెమలి | నడత | నిద్ర | ఆహార | రాజ్య | మరనం |
| సోమ బుధ | డేగ | నడత | నిద్ర | ఆహార | రాజ్యం | మరనం |
| తి తే తో తో | గుడ్లగూబ | మరణము | నడత | నిద్ర | ఆహార | రాజ్యం |
| తు తూ ధు | కాకి | రాజ్యము | మరణం | నడత | నిద్ర | ఆహారం |
| ధూ వ వా | కోడి | ఆహారము | రాజ్య | మరణం | నడత | నిద్ర |
| లె లే | నెమలి | నిద్ర | ఆహార | రాజ్య | మరనం | నడతా |
| లక్ష్మీవారం | డేగ | నిద్ర | ఆహారం | రాజ్య | మరనం | నడతా |
| నె నే టి టీ డి డీ | గుడ్లగూబ | నడత | నిద్ర | ఆహార | రాజ్యం | మరనం |
| శొ శో కు కూ | కాకి | మరణము | నడత | నిద్ర | ఆహారం | రాజ్యం |
| రు రూ | కోడి | రాజ్యము | మరణం | నడత | నిద్ర | ఆహారం |
| | నెమలి | ఆహారము | రాజ్య | మరనం | నడతా | నిద్ర |
| శుక్రవారం | డేగ | ఆహారము | రాజ్యం | మరనం | నడతా | నిద్ర |
| నె నే గి గీ ఒ ఓ | గుడ్లగూబ | నిద్ర | ఆహార | రాజ్యం | మరనం | నడతా |
| యొ యో తు | కాకి | నడత | నిద్ర | ఆహారం | రాజ్యం | మరనం |
| తూ దు దూ | కోడి | మరణము | నడత | నిద్ర | ఆహారం | రాజ్యం |
| | నెమలి | రాజ్యము | మరణం | నడత | నిద్ర | ఆహారం |
| శనివారము | డేగ | రాజ్యము | మరణం | నడతా | నిద్ర | ఆహారం |
| ము మూ | గుడ్లగూబ | ఆహారము | రాజ్యం | మరనం | నడతా | నీద్ర |
| మొ మో తి | కాకి | నిద్ర | ఆహార | రాజ్యం | మరనం | నడతా |
| లె ని మె | కోడి | నడత | నిద్ర | ఆహారం | రాజ్య | మరనం |
| | నెమలి | మరణము | నడత | నిద్ర | ఆహార | రాజ్యం |

| వారములు వాక్యాక్షరములు | పంచ పక్షులు | తొలి ఝూ౧౹ ఆహార | రెండవ ఝూ ౪ మరణం | ౩-వ ఝూ ౻ నిద్ర | నాల్గవ ఝూ ౭ రాజ్యం | ఐదవ ఝూ౧౪ నడత |
|---|---|---|---|---|---|---|
| సోమ శని వార ననా తుతూ దుదూ వొవో నినీ యెయే | నెమలి | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం | నడత |
| | కోడి | రాజ్యం | నడత | ఆహారం | మరణం | నిద్ర |
| | కాకి | మరణం | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం |
| | గుడ్లగూబ | నడత | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం |
| | డేగ | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం | మరణం |
| ఆది మంగళవా కెకే గెగే చచా శశా వువూ కొకో రిరీ | నెమలి | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం | మరణం |
| | కోడి | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం | నడత |
| | కాకి | రాజ్యం | నడత | ఆహారం | మరణం | నిద్ర |
| | గుడ్లగూబ | మరణం | సిద్ర | రాజ్యం | నడత | ఆహారం |
| | డేగ | నడత | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం |
| బుధవారము పిపీ బిబీ రెరే తతా దదా నునూ రొరో | నెమలి | నడత | ఆహారం | మరణం | నిద్ర | రాజ్యం |
| | కోడి | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం | మరణం |
| | కాకి | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం | నడత |
| | గుడ్లగూబ | రాజ్యం | నడత | ఆహారం | మరణం | నిద్ర |
| | డేగ | మరణం | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం |
| లక్ష్మివారము పొపో బొబో రిరీ యెయే వవా తుతూ దుదూ | నెమలి | మరణం | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం |
| | కోడి | నడత | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం |
| | కాకి | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం | మరణం |
| | గుడ్లగూబ | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం | నడత |
| | డేగ | రాజ్యం | నడత | ఆహారం | మరణం | నిద్ర |
| శుక్రవారము ముమూ లొలో పిపీ బిబీ యెయే కకా గగా | నెమలి | రాజ్యం | నడత | ఆహారం | మరణం | నిద్ర |
| | కోడి | మరణం | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం |
| | కాకి | నడత | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం |
| | గుడ్లగూబ | నిద్ర | రాజ్యం | నడత | ఆహారం | మరణం |
| | డేగ | ఆహార | మరణం | నిద్ర | రాజ్యం | నడత |

| వారములు వాక్యాక్షరములు | పంచ పక్షులు | తొలి ఝూ ౧। ఆహారం | రెండవ ఝూ ౪। నిద్ర | 3-వ ఝూ ౧౪ నడత | నాల్గవ ఝూ ౪ మరనం | ఐదవ ఝూ ౨ రాజియ |
|---|---|---|---|---|---|---|
| సోమ శని వార ఋకూ గుగూ ణన మెమే తితీ దోదో | నెమలి | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత | మరనం |
| | కోడి | ఆహారం | నిద్ర | నడత | మరనం | రాజియ |
| | కాకి | నిద్ర | నడత | మరనం | రాజియ | ఆహారం |
| | గుడ్లగూబ | నడత | మరనం | రాజియ | ఆహారం | నిద్ర |
| | డేగ | మరనం | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత |
| ఆది మంగళవా మె మేనినీలోలో తుతూ దుదూ తథదధా తాధా దాధా | నెమలి | నిద్ర | నడత | మరనం | రాజియ | ఆహారం |
| | కోడి | నడత | మరనం | రాజియ | ఆహారం | నిద్ర |
| | కాకి | మరనం | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత |
| | గుడ్లగూబ | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత | మరనం |
| | డేగ | ఆహారం | నిద్ర | నడత | మరనం | రాజియ |
| బుధవారము నినీ మొమో రురూవవా తెతే దెదే | నెమలి | నడత | మరనం | రాజియ | ఆహారం | నిద్ర |
| | కోడి | మరనం | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత |
| | కాకి | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత | మరనం |
| | గుడ్లగూబ | ఆహారం | నిద్ర | నడత | మరనం | రాజియ |
| | డేగ | నిద్ర | నడత | మరనం | రాజియ | ఆహారం |
| గురువారము నొనో రురూ వవా నెనే కికీగిగీ ఖిఖీ | నెమలి | మరనం | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత |
| | కోడి | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత | మరనం |
| | కాకి | ఆహారం | నిద్ర | నడత | మరనం | రాజియ |
| | గుడ్లగూబ | నిద్ర | నడత | మరనం | రాజియ | ఆహారం |
| | డేగ | నడత | మరనం | రాజియ | ఆహారం | నిద్ర |
| శుక్రవారము ననా మెమే రిరీ కొకో గొగో ఘొఘో వువూ | నెమలి | ఆహారం | నిద్ర | నడత | మరనం | రాజియ |
| | కోడి | నిద్ర | నడత | మరనం | రాజియ | ఆహారం |
| | కాకి | నడత | మరనం | రాజియ | ఆహారం | నిద్ర |
| | గుడ్లగూబ | మరనం | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత |
| | డేగ | రాజ్యం | ఆహారం | నిద్ర | నడత | మరనం |

## ఆరూఢ ఫలకాండము.

కృష్ణ శుక్లములను పూర్వ అపరపక్షములయొక్క రేపగలు పక్షులుగావించునట్టి కార్యాకార్యముల గురుతులను దెలిసికొనదగునట్టి పఠములు నాలుగున్ను దెలిపియుండువాట్లను యెరిగి యీ గ్రంథమున కడపటకనుపరచియుండు వాట్లను చక్కగా దెలిసికొని ఫలా ఫలములు దెలుపవలెను.

ఆయాపక్షులయొక్క పక్షములున్ను వారములున్ను ఝామము లున్ను గణుతించి వాటియొక్క కార్యాకార్యములయొక్క సూక్ష్మా సూక్ష్మములను వరుసక్రమముగా దెలిసికొని ఆరూఢ ఫలములను చెప్ప వలెను.

### పంచపాదివృత్తము.

ఝామం బొకటిన్నర నొకటిన్నర నొకటి నొకటిన్నర రెండో
ఝామం బొకటిన్నర నొకటిన్నర అరయు రెండు అరయగు మూడో
ఝామం బొక్కటి రెండగు యొకటిన్నర యొకటిన్నర నాల్గవ
ఝామం బొక్కటి యొకటిన్నర యొకటి యొకటి యొకటి యైదవ
ఝామం బర రెండు నరయు నొకటి నొకటి నొకటియు నగునో

### పక్షులయొక్క గణితరహస్యము.

| ఝామము | ౧ | ౨ | ౩ | ౪ | ౫ |
|---|---|---|---|---|---|
| డేగ | ౧½ | ౧½ | ౧ | ౧½ | ½ |
| గుడ్ల గూబ | ౧½ | ౧½ | ½ | ౨ | ½ |
| కాకి | ౧ | ౨ | ౧ | ½ | ౧½ |
| కోడి | ౧½ | ౧½ | ౧ | ౧ | ౧ |
| నెమలి | ½ | ౨½ | ౧ | ౧ | ౧ |

ఈగణితవిభాగములను గణుతించిన మొత్తములలెక్క రీతిగా పక్షులున్ను ఆయాఝామములయందు చెప్పబడురీతిగా కార్యముల యొక్క ఫలాఫలమును దెలిసి చెప్పవలయును. చేయుకార్యములు వీశే

షముగా యుండినయెడల లాభములే యిచ్చును. చెడుగువాటిల్లునట్టి గణితమువచ్చినా కష్టమునకు అగునని దెలియవలెను.

ఇవి పక్షులకైన గణితఘడియలనియెరుగవలెను. ఇదియే సూక్ష్మ ఘడియలు యిందేదైనను వివరించి యింతకుమును దెలియపరచలేదు గాన దీనిని రెండవ అధ్యాయమున జాతక కాలమున చెప్పబడియున్నవి.

పక్షుల వివరము.

గీ॥ పక్షి నెరిగినవాని పగసేయ రెవ్వరు
కక్షి జేసినంత కాలగతుల
పక్షమైదిరు గేరు బలుపాట్లబడుచును
భ్రష్టులనగభూమి బరగుచుండు.

ఈ పక్షిశాస్త్రిమును బాగుగా పరిశీలించి సదా అభ్యాసమున యుండు వారలతో పగసేయునట్టి రాజాతిరాజులైననుధనవంతులైనను బలవంతులైనను మంత్రతంత్రంబులు నేర్చినవారైనను వారియొక్కబల సాహస చమత్కారములేవియు ఫలించవు. వారలకు దుష్టకాలసంభవంబు వచ్చుటకు కారణము పక్షిశాస్త్రిమెరిగిన వానితో వైరము నలుపుదురు. కావున వ్యర్థపుపలుకులచేతను ఢాంభితముచేతను తమ తమ బలాబలంబులును మమకారంబులును యితరులపై చూపరాదు.

పక్షులజామములు.

సీ. పసుపు తెలుపు నెరుపు పచ్చయు నలుపగు
వర్ణముల్ పక్షుల కమరి యుండు
పక్షమునుపూర్వ పక్షంబు లీమైదు
రంగులేస్థిరముగారహినిమించు
అపరపక్షంబైతె నలుపెరుపుపసుపులై
తెలుపుపచ్చయుగూడి తేజరిల్లు
బ్రాహ్మణనృపతియు వాణిజ్యపరుడగును
శూద్రజాతియు పంచమజాతివాడు

అనుచుఛాయలు వివరంబులవనియందు
జాతిక్రమముల నెరిగినచాలమేలు
ఫలములనుదెలుప సత్ఫలములగును
వివరముగ బలుక యీవిధమువలయు.

పక్షులరంగులు. పూర్వపక్షము

క. చక్కని నెమలియు మెరుపగు
జక్కగ బంగారు ఛాయ దనరు దివాంధం
బక్కట కాకియు నలుపగు
నెక్కడ నిది పూర్వపక్ష మెంచుము భువిలో.

క. కోడియు మేఘచ్ఛాయయు
నాడగ డేగయును దెల్పు నవనీస్థలిలో
జాడమెరింగిడ రంగులు
తోడగునివి పూర్వపక్షతోరణపక్షుల్.

పూర్వపక్షమున నెమలి మెరుపుఛాయగాను, గుడ్లగూబ బంగారుఛాయగాను కాకినలుపుగల దట్టపుఛాయగాను కోడి తేటయగు మేఘమువంటిరంగుగాను డేగ తుల్యమగు తెలుపురంగుగాను ప్రకాశించుచుండును.

అపరపక్షము—రంగులు

క॥ అరయగ డేగయు రజితము
బొరిగొనిచాయందునిలచు పూనికతోడన్
ధర గుడ్లగూబ బంగర
మెరుపగు కాకియును కోడి మెఃనుయునపచ్చె.

క. నెమిలికి నలుపగు ఛాయయు
క్రమముగ బల్కి రిది కాలజ్ఞానులు పక్షుల్
నమరిన పక్షము అపరము
విమలతగా దెలిపిరిట్టి వివరముసుమ్మీ.

అపరమనుపక్షంబున డేగయనునది జీవితమను వెండి రంగుగా యుండును గుడ్లగూబయనుపక్షి బంగారుఛాయగాను వాయసము యెఱ్ఱగాను కోడియనునది పచ్చనిరంగుగాను నెమలి నల్లని ఛాయతోను ప్రకాశించునని కాలజ్ఞానమెరిగిన మునీంద్రులు వక్కాణించిరి గాన యీపక్షులరంగులను పక్షములవరుసగా పంచి బలుకుట చాలామంచిది. యిదియే కానకపోయిన వస్తువులరంగులు యిట్టివని చెప్పుటకు వీలు బడును.

అక్షరములమీద వచ్చునట్టి పక్షులవరుసలను గణుతించి రంగుల స్థిరపరచి ఆరూఢములను చెప్పవలెను.

పంచభూతములదిక్కులు ఫలములు.

చం. పృథివియు నప్పుతేయ్యువగు పూర్వస పక్షము నొప్పయదు దీ
నిదియగు వాయ్వునాకసము నందగు పక్షము శుక్లమా నుయీ
విధమున తూర్పు దక్షిణము వేడ్కగు వుత్తర దిక్కులే శుభం
ముదమున నైరుతీయనల మూలలు మధ్యము లాభమా సుమీ.

పక్షులకు గలిగిన దిక్కులను పంచియు ఆదిక్కులకు సమముగా పంచభూతములగు పృథ్వి అప్పు తేయువు ఆకసములనుజేర్చి పూర్వ అపరపక్షములతో గలిపి లెక్కించి చూచి ఆపై ఫలాఫలములను దెలుప వలెను.

దిక్కులయందు గలిగిన నక్షత్రములు
తిథులవివరము.

తూర్పుదిక్కునకు శుక్రవారము ఉత్తరనక్షత్రము అష్టమి తిథి గలిసినది మంచిది.

ఆగ్నేయమూల శనివారము రేవతినక్షత్రము అష్టమితిథి మం.

దక్షిణదిక్కు ఆదివారము చిత్త మఖ ఆశ్లేష పౌర్ణమి మంచిది.

యీలాగు తిథులు వాసరములు నక్షత్రములు గూడిన దినముల యందు వచ్చెడి పక్షులు మంచిఫలముల నొసగును. యిది పూర్వపక్షము యొక్క క్రమము.

పడమరదిక్కు మంగళవారము అపరపక్షఅష్టమితిథి విశాఖనక్షత్రము మంచిది.

దక్షిణదిక్కు ఆదివారము పుబ్బనక్షత్రము ద్వాదశితిథియు మం.

నైరుతిమూల సోమవారము చిత్తనక్షత్రము మఖ ఆశ్లేష పౌర్ణమి తిథి మంచిది.

పడమరదిక్కు మంగళవారము అపరపక్షము అష్టమితిథి విశాఖ నక్షత్రము మంచిది.

వాయువ్యమూల బుధవారము ఉత్తరాషాడ ఆశ్లేష నక్షత్రములున్ను పంచమి మంచిది.

ఉత్తరదిక్కు గురువారము కృత్తికనక్షత్రము చతుర్థి మంచిది.

ఈశాన్యమూల శుక్రవారము పుష్యనక్షత్రము మంచిది.

దిక్కులగల లోహములు స్త్రీపురుషులు.

క. కను గొన దక్షిణ రజితము
నెనయగ తూర్పు గలను రాగి యెలమిన కంచుగా
అనిశము యుత్తర మొందును
చనువున పడమరనయంబు చయ్యన నొప్పుగా.

క. మగవాడు దక్షిణంబగు
పగరంబగు యింతి మూర్పు పడమరజీవం
బుగ బేరీ యుత్తరంబున
సొగసుగ బల్కంగ వచ్చు శోధించు నెడగా.

పక్షంబులును వారములును దిక్కులను నక్షత్రములను దెలిసి పక్షులయొక్క ఫలముల చెప్పునపుడు ప్రశ్నలనిచ్చినవారు దారబోసిన వస్తువులను దెలిసికొనుటకై పక్షులయొక్క రంగులను దెలిపియున్నవి. అవి ఆలగించుటయెగాక ప్రశ్నయిచ్చినవారుయుండుస్థలమగు దక్షిణము

వెండియనియు మొగవాడనియు తూర్పుదిశయైతే తామ్రఛాయయనియు వొకస్త్రీయనియు ఉత్తరదిక్కైనచో కంచుయనియు స్త్రీపురుషరూపముగా యుండు బేడియనియు పడమరదిక్కైతే ఇనుమనియు వొకజీవమును యుద్దేశించియుండు ఫలమని దెలిసి బలుకవలెను.

దిక్కులయందుసేయుకార్యములు.

తే-గీ. తూర్పు నాగ్నేయంబు దోచును మరణము
దక్షిణంబు రాజు నాహార మైరుతి
పశ్చిమంబు నడత పరగవాయువు నిద్ర
యుత్తర మీశాన్య మొందు శుభము.

తూర్పుదిశయు ఆగ్నేయమూలయు మరణములని దెలియవలెను దక్షిణదిక్కైతేనేని రాజ్యభోగమనుభవించుననియు నైరుతీమూలైతే ఆహారమనియు పశ్చిమదిక్కు నడతయనియు వాయువుమూల నిద్రయనియు ఈశాన్యము ఉత్తరము లీరెండుదిశలకు శుభఫలములే జెప్పబడునపుడు పక్షులు అయిదున్ను అయిదు దిక్కులుగా భాగించుకోవలెను.

దిక్కులను పక్షుల పూజించుట.

క. తూరుపు మెరుపగు దక్షిణ
దారిగ నలుపగును నిరుతి దనరగ పచ్చన్
నోరయగ పడమర నలుపౌ
ధరవాయువు మూలపసుపు వాలమి వెలయున్.

క. ఉత్తరము తెలుపు ఛాయయు
మొత్తగ మీశాన్యమనియు మెలగును తెలుపై
చిత్త భ్రమ లేక మూలల
తత్తర పూజించి పక్షిదారుల గనలే.

ఛాయలను దెలిసికొని ఆరూఢము తెలుపునెడ తూర్పుమెరుపు ఛాయయగును దక్షిణదిశయైతే నలుపురంగగును. నైరుతిమూలయైతే

పచ్చనగును పడమర నలుపురంగగును వాయువ్యమూలలైతే పసుపగు
ను ఉత్తరము తెల్లఛాయయగును యీలాగుననే దిశలనుగమనించి ప
క్షులను నిర్ధారణచేసి ఆరూఢఫలములను బలుకవలెను.

పక్షిపొంతనము.

అయిదు పక్షులలో మొదటి పక్షియగు డేగ యనునది చాలా
మంచిది యేలాగననగా నిద్రయందైనను నడతగాచరించినను మరణ
మొందినను ఆహారమునయున్నను డేగ యనుపక్షి ఉచ్ఛ మనబడును.

గుడ్లగూబయనుపక్షి ఆహారమందును రాజ్యభోగమందున్నను
యీ రెంటికి సంచరించుచుండగా మంచియనబడును నడత నిద్ర మరణ
ము లీమూడున్న గుడ్లగూబకు బలిమి చెప్పరాదు.

కాకి యను పక్షి తొలిపక్షిగా యేర్పడినట్లైతే చాలా బలము
గలదు యీ కాకమునకు గలిగినబలము డేగకుచాలదని దెలియవలెను
కాకియే శ్రేష్ఠమగును.

యీవాయసము రెండవపక్షియైనేని మరణము రాజ్యభోగ
ము నడత నిద్ర ఆహారము మొదలగు వీట్లలో యెవియైనను గణితము
నకువచ్చినపుడు కోడివలెను గుడ్లగూబవలెను దలచుకోవలెను.

నెమలి మరణమందున్నను నిద్రయందున్నను రాజ్యభోగమందు
న్నను నడతయునైనను ఆహారమందైన నున్నప్పటిన్ని భయ మొందని
భావము యీ నెమలి గతించినను అందము చేకూరును రాజులు అపజయ
మొందుదురు ఐశ్వర్యముగలదు తక్కినపక్షులకు యీ యోగ్యత రాదు.

పక్షులయొక్క అధికారవారములు.

శుక్లపక్షమున మంగళ ఆది యీదినములు డేగకు అధికారము

,, బుధ సోమ ,, గుడ్లగూబకు ,,

,, గురు లేక లక్ష్మి ,, కాకికి ,,

| | | | | | |
|---|---|---|---|---|---|
| | ,, | శుక్ర | ,, | కోడి | ,, |
| | ,, | శని | ,, | నెమలి | |
| కృష్ణ | ,, | బుధ | ,, | కాకి | ,, |
| | ,, | బుధ లేక లక్ష్మి | ,, | గుడ్లగూబ | ,, |
| | ,, | శుక్ర | ,, | డేగ | ,, |
| | ,, | ఆది మంగ | ,, | కోడి | ,, |
| | ,, | శని సోమ | ,, | నెమలి | ,, |

శుక్ల కృష్ణ పక్షములయందు పక్షులు సంచరించునపుడు వాటి యొక్క ఛాయయును జాతియు భూతము దినమున్ను లోహములున్ను మైత్రమున్ను ఛాయమూలములు బలాబలములు కాలములు లోబములు కోణములు స్థానములు రంగులు చోట్ల వచ్చునదియు పోవునదియు నక్షత్రములు తిథులు వ్రేళ్ళను అవయవములు లెక్కల సంఖ్యలు మొదలగునవి యెల్లయు సంగ్రహించి సూక్ష్మముగా నొక్కచక్రమునగా జేసి చూపబడుచున్నది గాన ప్రశ్నలిచ్చువారలు సాభిప్రాయములిట్టివని సులభముగా బదులు బలుకతగును యీసూక్ష్మమార్గముస్థిరముగా గ్రహించిచూడవలెను.





## ఆరూఢ ఫలముల దెలుపునట్టి చక్రము.

| | విషయములు. | డేగ | గుడ్లగూబ | కాకి | కోడి | నెమలి |
|---|---|---|---|---|---|---|
| శుక్ల | పూర్వపక్షం ఛాయ | పసుపు | తెలుపు | యెరుపు | పచ్చ | నలుపు |
| కృష్ణ | అపరపక్షము ఛాయ | నలుపు | యెరుపు | పసుపు | తెలుపు | పచ్చ |
| శుక్ల | పూర్వపక్షము జాతి | బ్రాహ్మ | వర్తకు | రాజు | కాపు | నీచుడు |
| కృష్ణ | అపరపక్షము జాతి | బ్రాహ్మ | రాజు | వర్తకు | కాపు | నీచుడు |
| శుక్ల | పూర్వపక్షం భూతం | అగ్ని | వాయు | పృథ్వి | నీళ్ళు | ఆకాశం |
| కృష్ణ | అపరపక్షం భూతం | పృథివి | అప్పు | తేయ్వ | వాయు | ఆకాశం |
| శుక్ల | పూర్వపక్షం దిశలు | తూర్పు | దక్షిణం | పడమర | ఉత్తర | మద్యం |
| కృష్ణ | అపరపక్షం దిశలు | తూర్పు | ఉత్తరం | దక్షినం | మధ్యమ | పడమర |
| | లోహము | బంగా | వెండి | తామ్ర | కంచు | ఇనుము |
| | జాతి ఆడది మొగవాడు | మొగ | ఆడది | మొగ | ఆడది | మొగ |
| | ధాతు మూల జీవనము | మూల | జీవనం | ధాతు | మూల | జీవనం |
| | బలిమిగుర్తెరుగుట | లి పాలు | అర్ధము | వొకటి | పాతిక | అర్ధము |
| | కాలములు | భవిష్య | భూత | భవిష్య | వర్త | గడచిన |
| | కోణములు | నిడివి | పంచ | షట్కో | చదుర | ముక్కోన |
| | స్థానములు | ఉనికి | నీటికా | నిలుగు | కొమ్మ | ఆడది |
| | రుచులు | తీపు | పులుసు | తొగు | కెనరు | చేదు |
| | రాకలు | వస్తువు [illegible] | దెగ్గిరవచ్చుచున్నాడు | తలచినదేవస్తున్నాడు | నడచివచ్చుచున్నాడు | గలసివచుచ్చున్నాడు |
| | పోవువాడు | ఆడది | మొగ | మొగ | భూమి | అడది |
| | నక్షత్రములు | అశ్వని5 | ఆరు6 | ఉత్త 5 | అను 10 | శతభి1 |
| | తిథులు | పంచ | ప్రథమ | తృతీయ | చతుర్థి | ప్రథమ |
| | వ్రేళ్ళు | చిటికెన | అవామి | మధ్య | చూపు | పెద్ద |
| | అవయవములు | ముఖ | కంఠ | రొమ్ము | కడుపు | తొడ |
| | అంకెలు | పది | నూరు | లక్ష | వెయ్యి | వొకటి |

ఈ చక్రమున్ను పై చక్రముతో సంబంధించినది.

| విషయము | డేగ | గుడ్లగూబ | కాకి | కోడి | నెమలి |
|---|---|---|---|---|---|
| కాలనిర్ణయ | వొకవా | పక్షము | సంవత్స | నెల 1 | జ్యోతి |
| నాణ్యము | అణాలు | రూకలు | వరహా | రూపా | కాసు |
| యిచ్చేకాల | గెడువు | దినము | యియ్య | త్రిప్పగ | ఇయ్య |
| పదార్థము | మచ్యం | కోడి | మేక | పంది | పక్షి |
| ఆహారము | పలహార | సంకటి | అన్న | నూకల | ఆకాలు |
| కాయకూర | కామ | తోటకు | దుంప | కాబ | పువ్వు |
| వస్తువుదా | జయలు | అడవిన | యింటి | పొరగిం | చిక్క |
| తూకము | శేరు | ౪ పడి | తూము | పడి | చిటాకు |
| వస్త్రము | నారమ | పట్టు | జలుతా | వరాలు | గంత |
| దినములు | అయిదు | రెండు | మూడు | నాలుగు | వొకటి |
| వయస్సు | పెద్దవా | పిల్లవా | పోడవు | పొట్టి | ఇద్దరు |
| అంశములు | చిన్నవా | నడివ | రాజు | వలసలు | చావు |
| రంపములు | ధాటి | పొట్టి | వెంట్రు | బలము | నల్లని |
| జయము | ధాటి | చిన్న | గలసిన | చిన్నవా | ఇద్దరు |
| అక్షరము | బాల్యం | 2నడివ | 3రాజ్య | 4వృద్ధి | 5మర |

పగటిపూటలు | రాత్రులు

| కాలము | | శుక్లమను పూర్వపక్షమున | కాలము |
|---|---|---|---|
| ఆహారము | ౧౪ | | ౧౹ |
| నడత | ౧౹ | | ౧౹ |
| రాజ్యభోగము | ౨ | | ౧ |
| నిద్ర | ౫ | | ౧ |
| మరణము | ౪ | | ౧౪ |

కృష్ణపక్షమను అపరపక్షము

| పగలు కాలము | | రాత్రి కాలము |
|---|---|---|
| ఆహారము | ౨ | ౧౻ |
| నడత | ౧౺ | ౧౻ |
| రాజ్యభోగము | । | ౻ |
| నిద్ర | ౺ | ౻ |
| మరణము | ౧। | ౧ |

శుక్లయను పూర్వపక్షపగలు సూక్ష్మకాల నిర్ణయములు.

| | | | | |
|---|---|---|---|---|
| శుక్రవారము | పగలు | ఆహారము | ఘడియలు | 3 |
| గురువారము | ,, | నడత | ,, | 5 |
| బుధవారము | ,, | రాజ్యభోగం | ,, | 2 |
| మంగళ ఆది | ,, | నిద్ర | ,, | 4 |
| సోమ శని | ,, | మరణము | ,, | 1 |

శుక్లమను పూర్వపక్షము రాత్రి సూక్ష్మకాల నిర్ణయము

| | | | | |
|---|---|---|---|---|
| గురువారము | రాత్రి | ఆహారము | ఘడియలు | 3 |
| బుధవారము | ,, | రాజ్యభోగము | ,, | 5 |
| ఆది మంగళ | ,, | మరణము | ,, | 2 |
| శుక్రవారము | ,, | నడత | ,, | 4 |
| సోమ శని | ,, | నిద్ర | ,, | 1 |

కృష్ణయను అపరపక్షము పగలు సూక్ష్మకాల నిర్ణయము.

| | | | | |
|---|---|---|---|---|
| గురువారము | పగలు | ఆహారము | ఘడియ | 3 |
| శనివారము | ,, | మరణము | ,, | 5 |
| సోమ బుధ | ,, | నిద్ర | ,, | 2 |
| శుక్రవారము | ,, | రాజ్యభోగము | ,, | 4 |
| మంగళ ఆది | ,, | నడత | ,, | 1 |

కృష్ణపక్ష అపరపక్షము రాత్రి సూక్ష్మకాల నిర్ణయము

| | | | |
|---|---|---|---|
| శుక్రవారము ,, | ,, | ఘడియలు | 3 |
| సోమ బుధ ,, | నిద్ర, | ,, | 5 |
| శనివారము ,, | నడత | ,, | 2 |
| గురువారము ,, | మరణము | ,, | 4 |
| మంగళ ఆదివారము | రాజ్యభోగము | ,, | 1 |

| | | |
|---|---|---|
| ఈశాన్యమూల<br>తెలుపు<br>శుక్రవారము<br>పూర్వాషాఢ<br>ప్రథమ తిథి<br>శుభము | ఇంద్రుడు తూర్పు<br>ఎర్రనిచాయ<br>శుక్రవారము<br>ఉత్తరాషాఢ<br>అష్టమితిథి<br>మరణము | అగ్నిమూల<br>మెరుపు<br>శనివారము<br>రేవతి<br>అష్టమితిథి<br>మరణము |
| కుబేరుడు ఉత్తరము<br>బంగారు ఛాయ<br>గురువారము<br>ప్రకాశము<br>చతుర్థశి<br>నాశము | తూర్పు<br>ఉత్తరము / దక్షిణము<br>ఇ ఒ అ ఉ ఎ<br>పడమర | యేముడు<br>నల్లనిచాయ<br>ఆదివారము<br>పుష్యమి<br>ద్వాదశి<br>రాజ్యభోగము |
| వాయుమూల<br>నల్లచాయ<br>బుధవారము<br>ఆశ్లేష<br>పునర్వసు<br>పంచమి<br>నిద్ర | వరుణుడు పడమర<br>పసుపురంగు<br>మంగళవారము<br>విశాఖ నక్షత్రము<br>కృష్ణపక్ష అష్టమి<br>నడుత | నైరుతిమూల<br>నల్లనిచాయ<br>సోమవారము<br>చిత్త, మఖ,<br>ఆశ్లేష<br>పౌర్ణమి<br>ఆహారము |

ఈ సూక్ష్మములను వివరములను బాగుగా ఆలోచించి ప్రశ్నోత్తరములు చెప్పుటకు యిది చాలా సంగ్రహపుగుమార్గము కావున ముఖ్యముగా యాకాలములును గ్రహించవలెను.

ఆరూఢము లడగవచ్చినవారలు కూర్చున్నను నిలుచున్నను వారలుండు దిక్కులను గుర్తెరిగి వారము తిథి నక్షత్రము పక్షులు వస్తులగురుతులును అనుసరించి తటాలున ప్రత్యుత్తరమియ్య దగునట్టి అష్టకర్మచక్రము.

ఇవి సూక్ష్మపంచపక్షుల వివరము యీ అష్టకర్మచక్రమునున్ను యింతకుపైగానుండు ఆరూఢఫలములను దెలుపునట్టి యంత్రములు నున్ను ఆవల కాలమసూక్ష్మము మొదలగు కృష్ణ శుక్ల పక్షముల రేపగళ్లు వివరములుదెలిసి ప్రశ్నలకు ప్రతి ఉత్తరములు బలుకుట లతి సులభమార్గమని దెలియవలెను.

ఈస్థూలసూక్ష్మ పంచపక్షుల నివరములను బాగుగా పరిశీలించి మల్లించుటచే మిక్కుటమగు తెలివితేటయుగలిగి సూక్ష్మాసూక్ష్మంబు లెరిగి ప్రవర్తించనగును.

ఫలాఫలములు దెలుపునెడ యితరులు యిచ్చునట్టి ప్రశ్నలకు ప్రత్యుత్తరములు పొరబాటులేక దెలుపవచ్చును. యిది మహాఋషు లలో శ్రేష్ఠులై వెలసిల్లునట్టి అగస్త్యమునుల వాక్యములు.

సంపూర్ణము



# వి ష య సూ చి క

# విషయసూచిక,



విషయసూచిక – సంపూర్ణము.

